# ప్రహ్లాద నాటకము






గ్రంథకర్త :
సువర్ణ ఘంటా కంకణ బిరుదాంకిత
సంస్కృతాంధ్ర పండిత
మహాకవి బండ్ల సుబ్రహ్మణ్యము

# ప్రహ్లాద నాటకము








సువర్ణ ఘంటాకంకణ బిరుదాంకిత
సంస్కృతాంధ్ర పండిత
మహాకవి బండ్ల సుబ్రహ్మణ్యము.



శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యం కవిగారి "ప్రహ్లాద" నాటకమును సాంతము "నోరూరగఁ జవులుపుట్ట" జదివితిని — అనుటలోనే ఈ దృశ్యకావ్యముయొక్క ప్రదర్శన యోగ్యత ప్రదర్శితమయినదను కొందును. తదనుకూలముగ సాధ్యమయినంతవఱకు విసంధిగ వ్రాయుట, పద్యములలో చిన్న చిన్న గీతలుంచి అవి యెక్కడెక్కడ ఆపి చదువవలయునో కవి తెలియజేయుటయును-

కథావస్తువు పురాణమయినను, ధ్వనివిశేష ప్రభావముచే కావ్యమునకు ఆనంత్యముఁ కలదు కనుక అదృష్టపూర్వములగు దృశ్యములతో ఈ రమ్యకావ్యమొప్పుట మునుముందు నాకు దట్టిన విషయము. "శైవ వైష్ణవ మతభేదభావము" రాక్షసేంద్ర, తత్తనయుల వైరకారణముగ ఈకవి "ఊహించుట" ఒక నూతనత్వము. ఇంకను లోకమున మిగిలియున్న ఆవాసన మడిసినప్పుడు తదూహకు సార్థక్యము.

ఈకవికి సామెతలు నుడికారములు ఎడనెడ అహామహమికతో బడుట కాన నగును. వాచికాభినయనమున వానిచే సామాజికులు ముగ్ధులగుదురు. ఇంకను వానియందలి ధ్వనివిశేషము సహృదయానందకరము. ఉదాహరణకు లీలావతి ప్రహ్లాదకుమారునితో "ఎన్నడీ వెక్కడో సింహపీఠమదియే కనగోరుదునన్న పుత్రకా" అనుటలోను, కుమారుని దండించు సందర్భమున హిరణ్యకశిపుడు "ఏశకిన్ మదినమ్మి పెట్టెదవు నాకే పంగనామంబులన్" అన్నముక్కలోను ఎట్టి ధ్వనికలదో వినుకనువార లూహింపగలరుగదా!

ప్రాచీనకావ్య మధురిమ నీకవి తద్గతగౌరవ భావముచే పీడ జాలకున్నాడనుటకు— శుభశకునముగా పైడికంటిజత కూజితము, ఆశ్రమ వర్ణనము పట్టున సహజ వైరమునుమానిన జంతుద్వంద్వములును ఉదాహరణములు, ఇంతియకాదు అలంకారముల వైపునకు కవి మనసు పోవుచున్నది. అందును గొన్ని అపూర్వములు. ఉత్తర

దక్షిణ ధ్రువములైన తండ్రికొడుకుల మనసుల నడుమ "లీలావతి మనస్సు భూమధ్య రేఖవలెనుండి పుత్రశోక తపనునిచే తపింపబడుచున్న"దట! ఇట్టిపట్టులు చదువరులైన సామాజికులను కోరును.—

'ఏడో గిరిలో ఏకాంతంగా ఉండే అమృతకలశము' (పుట 51) గంపంత (ఇహలోకస్థులకు సూర్యునిపరిమాణము) కన్నుపెట్టుకొని కాచు శ్రీహరి (పుట-6) – ఈ మొదలయిన పల్కులతో కవి కున్న ఆధ్యాత్మికవిషయ పరిజ్ఞానము ద్యోతమగుచున్నది-

వీరగంభీరోక్తుల కనుపానముగా సందర్భోచితమైన హాస్యోక్తులును, అదుపుంచిన శృంగారపుఁబాటయు (పాఠశాలరంగమునను, పాములవాని రంగమునను) ప్రధాన రసాస్వాద్యతకు తోడ్పడుచున్నవి.

ఉదాత్త గుణాలంకార శోభితమగు ఈ రసవత్కావ్యమును "రైల్వే లిటరేచరు"గా జూచుట పాపహేతువు.

కాంత చాక్షుషక్రతువయిన ఇట్టినాటకమును ఆంధ్రసాధక లోకము "కాంచగలదిక కన్నుల కఱవుతీఱ".

ఢిల్లీ<br>6-1-54

ద్వాదశభాషావిశారద
కోట సుందర రామశర్మ.
[Department of Education]





అస్మత్పితృపాదులు
బండ్ల వేంకటసుబ్బయ్యగారు
గ్రంథకర్త

# సమాలోకనము

ఉన్నవి ప్రహ్లాద నాటకములు పెక్కు. ఎందుల కీనాటకమని సందేహమా? కావచ్చును తెలుఁగులో నాటకావతరణము జరిగి నది మొదలు నేఁటివఱకది భాషలో భావములలో నిర్మాణములోఁ జాల మార్పులందుచు మెఱుఁగుఁ దఱుగుల సరిచేసికొనుచుఁ బరిణామదశనుండి పరాకాష్ఠ కెదురు చూచుచున్నదని తజ్జ్ఞు లెఱుంగుదురు.

తొలుదొల్త రచింపఁబడిన నాటకములలోఁ బద్యములో వచ్చిన భావమే వచనములో, వచనములో వచ్చిన భావమే బద్యములో నుండునట్లును, సుమారిరువది ముప్పది రంగముల తోను, ఇరువదియైదు ముప్పదిపైగాఁ బాత్రలతోను, దాదాపు 120 పుటల తోను, నుండి 6, 7, 8 గంటలు ప్రదర్శించుటకు యోగ్యములుగా నున్నవి. అవి వోపికగల యాకాలపు మనుజులకు సరిపడినవి ఈ కాలమునఁ బ్రదర్శనము 3 గంటలకు మించినచోఁ బ్రేక్షకులకు విసుగెత్తును. ఈ కొలఁది కాలములో వీలైనన్ని రసములు నూత్న తేజముతో విరాజిల్లి సభ్యుల నానందాబ్ధి నోలలాడింపవలయును.

ఇది సినిమా యుగము. ఏది యెట్లున్నను ఆకర్షింపఁబడు చున్నారు ప్రజలు సినిమాలచే. మానవునకు నతని నీడకెంత భేద మున్నదో రంగస్థలమునఁ బ్రదర్శించు నాటకమునకు సినిమాకు నంత భేదమున్నదని గ్రహించు వారరుదు. ఈ యుగములో సామాజికుల దృష్టికిని సత్యమునకును మధ్యవర్తిత్వము జరుపవలసిన విధి యున్నది నాటక కర్తమీఁద. విమర్శనా దృష్టితో, రంగస్థలానుభవముతో, నటకుఁడైన కవిచే రచింపఁబడిన నాటకము పాత్రోచిత, రసోచిత భాషా భావములతోఁ బ్రదర్శనానుకూలముగ నుండుననుట యతిశయోక్తి కాఁజాలదు.

ఇంతకుమున్నే ఆంధ్ర ప్రపంచమున కీకవిగారు సుపరిచితులు. వేమన వీరి తొలికావ్యము. ముద్రిత నాటకములలో మూడవదిది ఇందుదూచినట్లుపడినవి పదములు. తీసివేసితిమా? యొకమాట - భావమునకో రసమునకో భంగము తప్పదు. చమత్కృతితో శ్లేష, వ్యంగ్యము కనబఱచుచు బూతిక లేకయే యూనికకు ప్రాధాన్యమిచ్చుచు మఱి సామాన్యుల యందుపాటునకు గ్రిందుపాటు గలిగింపక చిలికినాడు రసప్రవాహమును దన స్వచ్ఛందలేఖినితో ఈ కవిపుంగవుడు

ఏమందుము? అదికాలప్రభావమా? గ్రహచార ప్రాబల్యమా? ఆఘ్రాణించువారు లేక అడవియందలిసుగంధపుష్పమందే రాలి ఎండిపోవుచున్నది. ఆశ్రయమున్న కారణమున వాసన లేకున్నను రంగు రంగుల పటారముగనిపించు డిసెంబరు పూలు జనవరిపూలు ఏప్రియలు పూలు నడినెత్తిన గుట్టలుపడి కులుకుచున్నవి. ఆశ్రయమున్నప్పుడే మేటి కవితయైనను దీటుకట్టి నీటుకట్టుట.

పురాణమనిన గొందఱకు మూతివిగింపు గలుగుట వాస్తవము కావచ్చును. కాని మఘలోబుట్టి పుబ్బలోబోక ఏ మహాసముద్రమునం దేమూలనో ఒక చిన్న మట్టాకు నండగొనియైనను యుగ యుగాలకు నిలుచునది పురాణగాథ

కవిగారు తీసికొన్న కథ పురాణకథయేగాని పోకడలన్నియు నాధునికములే సనాతన మార్గమును దొలగక యధునాతన మార్గము నవలంభించుటలో నీకవిప్రతిభ అప్రతిమానము. జాతీయముల నుపయోగించుటనిన ఈ కవి సత్తమునకు సాము గరిడీ. నుడికారమున నానుడిలేదు, సర్వథా ప్రదర్శన యోగ్యముగానున్న ఈ నాటకమును నటకులు పాఠక మహాశయులు నాదరించి కవి యాశయమునకు సాఫల్యము గల్గింపగలరని విశ్వసించుచున్నాడ.

ఇట్టి యుత్తమ గ్రంథరాజముల బెక్కింటి వెలువరింప శక్తి సామర్థ్యములు కవిగారికి సర్వేశ్వరుడు ప్రసాదించును గాక!.

వేటపాలెము,
విజయ
సంక్రాంతి.

ఉభయ భాషాప్రవీణ, వైద్యవిద్వాన్
అబ్బరాజు సూర్యనారాయణ,
ఏ. ఆర్. ఏ. సి.

# నివేదనము

నా నాటకము బండ్ల భావయ్య ఉన్నత పాఠశాలా విద్యార్థులచే ప్రదర్శింపఁబడినది ఆసమయమున మా పాఠశాలా పరిపాలక వర్గీయులు, పరోపకార పారీణులు శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారు, నాట్యకళాభిమానులు శ్రీ నాసిక మల్లికార్జునరావు, B. A , B. Ed. గా , మాతృభాషా సేవాసకులు శ్రీ అచ్యుతన్న గోవిందరావు పంతులుగారు ప్రభృతులభినందించి యానందించి విద్యార్థుల పండ్రెండు రజిత పాత్రలచే బహూకరించి యాశీర్వదించిరి. వారికి నా చేమోడ్పులు.

ఇంతకుమున్ను నే వ్రాసినది బుద్ధావతారము. అద్దాని నభిమానించి బ్రహ్మాండమగు ప్రదర్శనముఁ గల్పించి యానందించి నన్ను సన్మానించిన శ్రీ వారణాశి సత్య శంకర నారాయణ B. A. గారికి నా మనస్సులు.

ఈరూపక రచనకు నా కుద్దేశముఁ గలిగించిన నాట్యకళాధురంధరులు శ్రీ బందా శ్రీరాములు పంతులుగారికి, ప్రోత్సహించిన శ్రీ అబ్బరాజు పూర్ణచంద్రరావు పంతులు గారికి, శ్రీ మాచిరాజు సీతారామయ్య B. A , B Ed. గారికి, "సాహిత్య సుధాకర" శ్రీ తల్లావజ్ఝల కృత్తివాస తీర్థులు B. A., B. Ed. గారికి, శ్రీ బులుసు ఉమామహేశ్వరరావు పంతులు గారికి, శ్రీ పేరాల రామమూర్తి పంతులుగారికి, "సాహిత్య విద్యాప్రవీణ" శ్రీ నందుల శేషగిరిశర్మ గారికిఁ, దక్కుంగల యుపాధ్యాయ సోదరులకు, మా పాఠశాలకమిటీ సభ్యులకు డాక్టర్ శ్రీ క్రోవి శేషాచలపతిరావుగారికి నా వందనములు.

ఈ నాటకమును జదివి అమూల్యాభిప్రాయము లొసంగిన సాహిత్యరత్న శ్రీ కోట సుందరరామశర్మ M. A., M. O. L., M. E. D. [Diploma in French, German, Persion, Pali & Prakrit Visarada etc ] గారికిని, ఉభయభాషాప్రవీణ, వైద్యవిద్వాన్, శ్రీ అబ్బరాజు సూర్యనారాయణ పంతులుగారికిని నా నమస్కారములు

దీనిని దన నాట్యకళారంగమున నొక భంగిమగా గ్రహింప ఆంధ్రవధూటికి నా పూజాపుష్పాంజలి.

— గ్రంథకర్త.

# ప్రహ్లాద



♦♦♦ ఇందలి పాత్రలు ♦♦♦

1 హిరణ్యకశిపుఁడు
2 ప్రహ్లాదుఁడు
3 నారదుఁడు
4 ఇంద్రుఁడు
5 బ్రిహ్మ
6 చండామార్కులు
7 విష్ణువు
8 విప్రజిత్తు
9 వజ్రదంతుఁడు
10 వ్యాఘ్రపాదుఁడు
11 జయంతుఁడు
12 దేవాంతకుఁడు
13 నరాంతకుఁడు
14 లీలావతి

**N. B :—** సేవకులు - విద్యార్థులు సమయానుకూలముగ వత్తురు.



శ్రీ దేవీహృదయాబ్జబంధకుఁడు - రాశీభూత కారుణ్యావే
లాదీప్తుండు - హిరణ్యాజిద్గుణుఁడు - లీలాజాత తేజస్వి - ప్ర
హ్లాదాత్మార్థి - నృసింహమూర్తి-త్రిజగద్వ్యాప్తుండు - నిత్యుండు ని
ష్ఖేద శ్రీలనొసంగుచున్ సతము రక్షించుచుఁ సభాస్తారకులన్.

[నాద్యంతమున ద్వితీయ సూత్రధార ప్రవేశము]

సూత్ర:- ప్రేయసీ! వేగముగా రమ్ము. సకల విద్యా సంపన్నులగు సభ్యులందఱు విచ్చేసి ఉపవిష్టులైయున్నారు. సకాలమునకు ప్రదర్శనమును ప్రారంభించుట సర్వోత్తమము

నటి:— (ప్రవేశించి) మనోహరా! ఇప్పుడే నాటకము ప్రదర్శింపఁ బోవుచున్నారు?

సూత్ర:- ప్రహ్లాద.

నటి:— సాంఘికమో సాంఘికమో యని కలవరించుచున్న ఈ రోజులలో ప్రహ్లాద నాటకమా? పురాణగాధయన ప్రాఁత చింతకాయ పచ్చడని కొందఱు పరిహసింతురేమో?

సూత్ర:- వెక్కిరింపఁబోయి వెలికిలఁబడినట్లు, పరిహసింపఁబోయినను వారినోటఁ బరమోత్కృష్టమైన ప్రశంసయే వెలువడినదని సంతోషించెదను. ఎట్లందువా? ప్రాఁతచింతకాయపచ్చడి మంచివారికేగాక రోగులకు ముఖ్యముగాఁ బథ్యమునకుఁ బనికివచ్చుచున్న సంగతి నీకుఁదెలియునుగదా? వివిధవిద్వేష విప్లవములచే సంఘమునకు మనోవైక్లబ్యము కలిగినప్పుడు సుమధుర భక్తిపూరితమగు శాంతిసందేశమే యత్యవసర పథ్యము. అదిగాక ప్రాఁతవడినను మేలిమికిఁ గాంతిఁ దఱుఁగునా! కస్తూరికిఁ బరిమళము పోవునా? "లోకోభిన్నరుచిః" అనిరి పెద్దలు, ఉడుకునెత్తురుతో నున్నపుడు కొందఱకు దుడుకుఁబోకలు పోవుట సహజము. చంద్రుని సైతము దూషించువారున్నారు. అంతమాత్రముచే నాతఁడు లోకో పకారి కాఁడా? పౌరాణికమైనను సాంఘికమైనను విశ్వక ళ్యాణ కరమగు మంచిని గ్రహించుటయే సహృదయుల

మతము. కథ ప్రాతదైనను రచనలోగల క్రొంగ్రొత్త కళావిలాసము రసగ్రహణ పారీణులగు ప్రేక్షక మహాశయుల ఆనందాబ్ధి నోలలాడింపఁ గలదనియే నావిశ్వాసము

నటి:— మంచిది. విశ్వాసము లేనిదే మానవుఁడు ఏ కార్యమును సాధింపలేఁడు. ఈ నాటకమునకు సమర్థులైన నటకులు సమకూడిరా?

సూత్ర:- తినఁబోవుచు రుచి అడుగనేల? ఆడఁదగిన వారు పాడఁదగిన వారు హాస్యరసమునందు ఆరి తేఱినవారు; ఏపాత్రకుఁ దగిన వారాపాత్రకుఁ జక్కఁగాఁబనగూడినారు, తెల్లవాఱులుండు పాత్ర నాకే కావలయునను తెలివి తక్కువ వాఁడుగాని, రాజపాత్ర నేనే వేయవలయునను రాజసము గలవాఁడు గాని, భటునిపాత్రి నాకెందులకని ప్రతిఘటించువాఁడు కాని ఈసంఘమున మచ్చునకైన లేఁడు. తగిన పాత్రనుదీసికొని తమశక్తిని ధారపోయఁగల దక్షులే యిందు నటింపఁబోవు చున్నారు. ఇంతేల ఆదర్శశిఖరాల నందుకొన్న ఈపరిదర్శనమే నిదర్శనము.

నటి:— అట్లైన నాటకకళా వీణాతంత్రులమీఁటి రసతరంగిణిలో మునిగిఁ తేలఁగలము.

[తెఱలో నారదుని వీణాగానము]

సూత్ర:- అదిగో! మహామహిమగల మహతీ నినాదము, శ్రవణానందముగ వినఁబడుచున్నది. నాదబ్రహ్మోపాసన చేయుచు ధర్మసంస్థాపనార్థము నారదమహర్షి ఎవరికో శృంగభంగము సేయ బయలుదేఱఁ బోవుచున్నట్లున్నది. మన మిచ్చట జాగుసేయరాదు, మహాకవి పోతనకొక నమస్కారము చేసి అనంతర కృత్యముల నెరవేర్పఁ బోవుదము రమ్ము.

(నిష్క్రమించు చున్నారు)

ఇది స్థాపన



# ప్రహ్లాద

## ప్రథమాంకము

### ప్రథమ రంగము

ఆశ్రమ ప్రదేశము

[గాన కళాలోలుఁడై నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు]

బ్రహ్మమానస పుత్రులైన సనకసనందనలు శ్రీహరినిదర్శింప వైకుంఠమున కరుగుటయు, విష్ణు ద్వారపాలకులగు జయవిజయులు ప్రభుశాసనంబున వారలను లోనికిఁ బోనీయక అడ్డుపెట్టి శాపగ్రస్తులగుటయు ఆ శాపకారణంబున జయ విజయులు హిరణ్యకశిప హిరణ్యాక్షులుగా జన్మించుటయు అందు హిరణ్యాక్షుఁడు హరితో వైరము వాటించి వరాహరూపధరుండైన నారాయణునిచే వధింపఁబడుటయు విధివిచిత్రము. నాఁటినుండి దేవదానవులు ప్రశాంతముగనే కాలము గడపుచుండిరి కాని హరిపైఁ బగసాధింపఁ దలఁచి హిరణ్యకశిపుఁడు మంథరాచలమున ఘోరతపం బొనరించుచుండెనఁట! నూతన విశేషములను దెలిసికొనుటకు నేను దానవ లోకమునకుఁ బోవలయును

గీ॥ శైవవైష్ణవ మతభేద భావమునను
తండ్రి కొడుకుల నడుమనే తగవుపుట్టి
పుట్టనున్నదియొక మహాద్భుత చరిత్ర
కాంచఁ గలరింకఁ గన్నుల కఱవుదీఱ.

(గానముతో నిష్క్రమించును)

[లీలావతి— "ఓ పుణ్యాత్ములారా! నా మొరాలంపుడు" అనుచుండ ఇంద్రుడు జుట్టు పట్టుకొనఁ బోయినట్లు నటించును. లీలావతి తప్పించుకొనుచు ప్రవేశించును. ఆమె వెంటఁ గోపముతో ఇంద్రుడు ప్రవేశించి]

ఇంద్ర:- అబలా! ఏల వేలన్వై గోలచేసెదవు? కదలుము

లీలా:- దుర్మార్గుఁడా! నీకాఁడుతోఁబుట్టువులు లేరా? పతి యింటలేని సమయమున సతిని ... నిండుచూలాలిని చెఱపట్ట నీయట్టి వానికిఁ దగునా? నీకు పోఁగాలము వచ్చినది. నీ తల్లి కడుపున చెడఁబుట్టితివి రా నీచా!

ఇంద్ర:- ఓసీ! రాక్షసీ! నా తల్లిదండ్రులను — నన్నెంచునంతదాన వైతివిగా? కదలుము కదలకున్న ఈడ్చుకొనిపోయెద. క్రూర రాక్షసీ!

లీలా:- నేను రాక్షసినే, ఎవరివి క్రూరకృత్యములో లోకము చూచుచుండ లేదా? పుట్టుకతో వచ్చినది పుడకలతోఁగాని పోదా? ఔను, మట్టి ఆవములో ఇత్తడి పాత్రలు దొఱకునా? నా ఉసురు నీకు తప్పక తగులకుండునా? ...... అబ్బా! నడవఁ జాల...... నడవఁజాల, గర్భభారము...... అబలను ... ఆఁడుదానను... అస్వస్థను... నీకు మ్రొక్కెదను; వదలుము.

ఇంద్ర:-ఛీ! నోరు మూసికొనుము (విడిచి) వదలితిని రమ్ము. నీభర్త దేవతాస్త్రీలను బంధించునపుడు ఇట్టి హితోపదేశముల నేల చేయవైతివి? అట్టి కఠినాత్మున కర్ధాంగివైన నీకు ఇనుముతోఁ గూడిన అగ్నికి సమ్మెట వ్రేటువలె ఇట్టి పరాభవము జరుగవలసినదే. ఇందువలన నీకును నీమగనికిని బుద్ధి రావలయును.

ఉ॥ అంత యహంత పెంచుకొని – యాగతి లోకము లెల్లఁ బెల్లుగాఁ
జింతలవంతలం జెదరి – చేడ్పడి బెగ్గిలఁ గారుచిచ్చునాఁ
బంతముతోడ రేఁగి బహుబాధలు పెట్టిన వానిపత్నికిం
కెంతటి కష్టముల్ గలుగుటీభువి కోరునోయంచి చూడుమా.

లీలా:-ఓరీ! మూఢా! నా భర్త నీవలె బుద్ధిహీనుఁడై దొంగతనముగా పరస్త్రీలను చెఱపట్టలేదు. నీవు మగటిమి గల మగవాఁడవైనచో నా మగనిని జయించి నన్ను బంధింపుము నిజముగా నా నాథుఁడేయున్న నిన్ను జుట్టుపట్టుకొని ఈడ్చి మా కోటగోడకు విసరికొట్టినచో వెన్నముద్దవలె కఱచికొని యుండెడివాఁడవు నీ యదృష్టము మంచిది నన్ను పోనిమ్ము

ఇంద్ర:- ఎచ్చటికి పోఁగలవు? ఇది ఘోరారణ్యము. పిచ్చిదానా! స్వర్గమునకంటె సౌఖ్యముగల ప్రదేశము కలదా? నందనవనమునఁగల పూవులు నీకు పాన్పగును. దివ్యకాంతామణులు నీకు దాస్యము సేయుదురు ఆకాశగంగా సైకత స్థలములు నీకు స్వైరవిహార రంగములు. అమృతము నీకాహారము. కామధేనువు నీవాకిటి ఆవు. రంభాదులు నీ సన్నిధానమున నృత్యము సేయు వేశ్యలు. నీకెట్టి అపకారమును చేయను ... కలికీ!

లీలా:- (బొమముడితో) కాదు, నీపాలిటి ములికి (పోఁబోవును)

ఇంద్ర:-(అడ్డగించి) ఆఁ! ముల్లోకాధిపతియగు ఇంద్రునా ధిక్కరించుట ... కొరవితో తలగోకికొనుట

చ|| ఎఱుఁగవె బేల! స్వర్గము యథేచ్ఛ గనేలెడి సార్వభౌముతో
విరసములాడె దేల? యొకవేయి మొనల్ గల యాయుధమ్ముతోఁ
గరము వెలుంగువాఁడితఁడు కాంత! యొకింతయుఁ
జింత సేయ కీ
తెఱఁగున నిక్కచేనిఁ గడు దీనదశంబడి కుందకుందువా.

లీలా:-హా! విధీ! ఇంకేది శరణ్యము? ఓ కరుణాకరా! శంకరా! నన్ను రక్షింపరావా? (చుఱుకుఁజూపుచూచి) ఆత్మరక్షణార్థము అబలలుకూడ ఆయుధములు ధరించుట అవశ్య కర్తవ్యము. (మొలలో బాకును వెదకును)

ఇంద్ర:-ఆయుధమా! ఇదిగో వజ్రాయుధము. (ఝుళిపించును)

నార:- ( శీఘ్రముగఁ బ్రవేశించి ) నారాయణ! ఏమి యిందా? వజ్రాయుధము ఝుళిపించుచుంటివా? ఆహా లీలావతిపై నియా? ( ఇంద్రుఁడుభయకంపితుఁడగును )

చ॥ త్రిభువన రాజ్యచక్రమును దివ్యతరంబుగ త్రిప్పఁజాలు నీ
ప్రభ దిగఁజాఱె వక్రముగ-రంభయు తక్కిన దేవవేశ్యలున్
విభవ సమేతలై కొలుచు వేడుకచాలద? నీవె ఈపనుల్
రభసము మీఱ చేయ - ఇఁక రాక్షసులేమి యొనర్తురోగదా
ఏ పుట్టలో ఏ పామున్నదో ఎఱుగవు.

ఉ॥ ఏమని యీమె తెచ్చితివి? ఎవ్వరు విన్నను నవ్విపోవరె?
కామమొ క్రోధమో మదమొ-కన్నులఁ గప్పినమత్సరంబొ-నీ
కేమి మహాపదల్ గలవొ - ఇట్టి పతివ్రత కంటనీరు ఈ
భూమి భరింపలేదు - తలపోయవు పుణ్యము పాప మక్కటా!

లీలా:- [నారదుఁజూచి] స్వామీ! నమస్కారము.

నార:- శుభంభవతు. [ఇంద్రునితో] ఎంత సాహసము!

చ॥ పితికినఁ బాలుగారెనని పిండదె నెత్తురువచ్చు దాక నీ
బ్రతుకున కిట్టి కోర్కె తగవా పగనైన గ్రహింపఁజూచు టే
గతికని యెంచెదో పరసుఖమ్ముక కంటఁగనంగలేవొ త
త్పతిమతి మార్పనీతరమ చాలిక ఁజత్తువొనొత్తువోగదా

గీ॥ భర్త తపమాచరింపంగ - వనముకేగ -
సకల భూషణములు వీడి - సాధువృత్తి -
తాను శివదీక్షఁ బూనిన ధన్యురాలి -
నిండు చూలాలి చెఱపట్ట - నీకుఁ దగున? ॥

ఆఱుమాసములు సాముచేసి—

ఇంద్ర:- లేదు నారదా! ఈమెను నేను వేఱొక దురుద్దేశ్యముతోఁ గొనిపోవుట లేదు.

నార:- "అర్ధరాత్రిమున గోడ నిందుకు త్రవ్వెదవురా" అన గోడ గట్టి చూచుట కన్నట్లు...

ఇంద్ర:- క్షమింపుఁడు. నాకా కోరిక లేదు ...... హిరణ్యకశిపుఁడు మీరెఱుంగనివాఁడు కాఁడు. మఱియు

చ॥ అతని సహోదరుండు – సురలందఱ దుంటకుమెట్ట కీడ్వఁగా –
సతతము దండయాత్రిలను సల్పుచు–మానులఁ జంపి–దేవతా
సతుల బలాత్కరించుటను–చక్రికనుంగొని–దంష్ట్రియై–రణో
ద్ధతి నతనిన్ వధించి–మము ధర్మపథంబునఁ బ్రోచె నారదా!

ఈమెభర్త క్రూరకర్ముఁడై జగద్భయంకరముగ సంచరించుట మీకును తెలియును గదా!

నార:- అయిన దానికిది ప్రతిఫలమా? (నవ్వి) పుండాకచోటనున్న మండాకచోట వేయుట!

ఇంద్ర:- కాదు. అతని వలననే ముల్లోకము లల్లాడుచున్నవి. అతనికి పుట్టనున్న ఈ గర్భస్థ శిశువువలన లోకముల కెట్టి కష్టములు గలుగునోయని ఈపెంగొనిపోయి ప్రసవింపఁగనే ఆశిశువుం జంపి ఈమెను వదలవలయునని.

మ॥ నను శంకింతువుగాని మద్రిపుని తీవ్రాటోపదుష్కృత్యముల్
గని దూషించితె యెన్నఁడైన నటఁబల్కంజాలితె ధర్మముల్
నిను వాఁడింతయు లెక్కసేయు నె మునీ! నీ దారిన నేగు మీ
వనితన్ పీడను దీర్చికొందుఁ బగదేవ వ్రాతముల్ మెచ్చఁగా

నార:- దైవవశమున హిరణ్యకశిపుఁడిప్పటిచ్చటికి వచ్చిన మీ పని యెట్లుండునో!

లీలా:- భగవంతుఁడెఱుఁగు. కాని అంతటి భాగ్యము కలుగునా?

ఇంద్ర:- [పరిహాసము] క...లు...గు . ను. [జనాంతికముగ] కన్ను కలఁగవలసినదే! (ప్రకాశముగా) ఆతఁడు జీవించి

యుండినఁగదా ఇచ్చటికి వచ్చుట? మా గూఢచారులు నదీ తీరములు ఘోరారణ్యములు మహాపర్వత గుహాలు పుట్టలు గుట్టలు వెదకి వెదకి వేసారిరి. వాని పొలకువైనను కనఁబడ లేదు. ఇంకెక్కడి హిరణ్యకశిపుఁడు! ఎన్నఁడో యమలోకం బున పాత్రితకాపై ఉండవచ్చు.

లీలా:- (చెవులు మూసికొని) అమంగళము ప్రతిహతమగుఁగాక!

నార:- ఇది యింకను సొగసుగానున్నది. గుడ్డివానికి లోకమెల్లు కనఁబడును. (లీలావతివంక జూచి) ఒక కన్నుగాదు, వేయి కన్నులున్నగుడ్డి (ఇందునితో) ఆతఁడు మంథరాచలంబున మహాతపస్సమాధిలోఁ బండియున్నవాడు. తత్తపోగ్ని దశ దిశావ్యాప్తము కానున్నది. ముందున్నది ముసళ్ళపండువు... మంచిపని చేయుచున్నాఁడవు. ఇంద్రా! ఈ శిశు మారణ కృత్య మెప్పటినుండి అభ్యసించితివి?

శా॥ నిర్భితింబర కాంతఁ బట్టదగునే - నీచాతి నీచంబుగా -
గర్భస్థుండగు బాలుఁ జంపఁదలఁతే కారుణ్య శూన్యుండవై
దుర్భేద్యుండగు సుమ్ము నీకతఁడు - నీతోషాబు దోషాచర
స్వర్భానుండరుకుంచి మ్రింగు-నీఁకసంభావింపు మోయింద్రుఁడా!

విషయలోలత్వమునందున్న చాకచక్యము కార్యశూర త్వమునందు లేదు. గంపంత కన్నుపెట్టుకొని కాచు శ్రీహరి యుంటచే ఈ యాటలు సాఁగుచున్నవి ఔరా! అసూర్యం పశ్యను అడవులలో అల్లాడించుట — (వికటముగ నవ్వి) ఇంచుక జ్ఞానదృష్టి ప్రసరింపుము.

మ॥ అవిగో! నీపురి రాలుచున్నయవి ఉల్కా-నీకమా? దైత్యస
త్యవమానోద్భవ పాపతాప విషజన్యాభిల కాలాగ్నులా?
అవి-దైత్యుండను అగ్నిపర్వతము ఘోరాకారతంత్రేలగా
దివిపైఁజిందెడి విస్ఫులింగములు? సందేహింపకే చూడుమా!

ఈమె గర్భమున పరమశైవ భక్తాగ్రేసరుండగు బాలుఁడు జన్మింపఁ గలడు. లోకములకు మేలు కలుగును ఈ తల్లి పతివ్రతామతల్లి మహేంద్రా!

మ॥ తరమే బ్రహ్మకునైన నీమె గుణ సత్యశ్రీలు వర్ణింప నో
సురనాథా! తన భర్త మేలుకొఱకై శుద్ధాంతరంగంబుతో
నిరతంబున్ శివపూజ చేయుచు మహానిష్ఠాగరిష్ఠాత్మయై
వరశక్తిం బతికిచ్చుచున్నది సదా ప్రాజ్ఞుల్ ప్రశంసింపఁగా
ఇఁక దొంగకు తేలు కుట్టినట్లు మెల్లగ ఇల్లుచేరుము.

ఇంద్ర:- సాధ్వీమణీ! క్షమింపుము. (నారదునకు నమస్కరించి) దేవా! పోయివచ్చెద. (నిష్క్రమించును)

లీలా:- నా పతిపాద తాడనంబునఁగాని నీదేహము పవిత్రము కాదు. పొమ్ము... కటా! ఈ పరాభవాగ్ని ఎట్లు చల్లారును?

నార:- అమ్మా! భయమువలదు. నేను నీకు తండ్రివంటి వాఁడను. ఇచ్చటికి సమీపమున నే నా ఆశ్రమము కలదు. అచ్చట మునికన్యలు నీకు చెలికత్తెలవలె పరిచర్య సేయుదురు... రమ్ము. నీపతి వచ్చువఱకు నిన్ను కాపాడఁగలను. అమ్మా! అటు చూడుము.

చ॥ పులియును లేడియుంగలిసి - పొందికతో ఒకచోట ఏటిలో
జలములు త్రాగుచున్నవి ప్రశాంతముగా-ఎటువంటి జంతువేన్
మెలగుఁను పిల్లిపిల్లవలె - మేము వసించెడిచోట - తల్లిరో!
కలఁగకు - నా తపోమహిమ కావగ - నీపయి ఈఁగ వ్రాలునే?

లీలా:- మునీంద్రా! నడవఁజాలను. ఈ చెట్టునీడను కొంచెము విశ్రమింతము

నార:- బిడ్డా! అట్లే విశ్రమింతము. (ఇరువురు కూర్చుందురు) తల్లీ! నీ మనస్సున కుపశాంతిని గలిగించుటకై బ్రహ్మానందముగ భగవన్నామ సంకీర్తనము చేయుదురు.

లీలా:- చిత్తము.

నార:- - గేయము -
(మాల్ కోస్ - త్రితాల్)

రావా నను బ్రోవవా - హరీ యిటు -
కావుము మాధవ - కనుము దేవా - ॥రావా॥
నిత్యభజనతో - నిను సేవించెద -
మోక్షదాయకా - మొఱ వినలేవా - ॥రావా॥

లీలా:- ఆర్యా! కొంచెముసేపు పరుండెద, [పరుండి నిద్రించును]

నార:- సృష్టిస్థితిలయ కారణుండైన పరాత్పరుని శక్తి అనంతము. [గర్భమునందున్న శిశువు ఊ కొట్టును] శ్రీ మహావిష్ణువు శేషశయనుఁడై లక్ష్మీసమేతుఁడై వైకుంఠమున నుండును. భగవంతుఁడగు హరి వరాహమూర్తియై తన కరాళ దంష్ట్రాగ్రమున భూమిని జలమునుండి లేవనెత్తెను. (లీలావతిఁజూచి) ఈయమ నిద్రించుచున్నదే! ఐన ఊకొట్టువారెవరు? ఓహో! గర్భమందున్న శిశువు. ఈ శిశువున కిప్పుడే నారాయణమంత్రోపదేశము చేసెద. ( ఉపదేశముచేసి ) ఇఁక ఈమెకు నిద్రాభంగము చేయరాదు.

లీలా:- (లేచికూర్చుండి; అక్కటా! నా కెట్టి కష్టములు సంప్రాప్తించినవి! తాపసేంద్రా!

ఉ॥ నమ్మినదాన నా ప్రణము నాథునకే తనువెల్ల గొల్లగా
నమ్మినదాన నెమ్మనమునందు భరింపఁ గరాని దుఃఖమే
క్రమ్మినదాన నేదరియుఁ గాననిదాన సుధీ నిధానమా
యెమ్మెయిఁ బ్రోతువో పతికి నేగతిఁజెప్పి ప్రశాంతిగూర్తువో

నార:- చింతింపకుము. ఎంతచెట్టున కంతగాలి. గొప్పవారికే గొప్ప కష్టములు. సూర్యచంద్రులకే రాహు కేతువుల బాధగాని నక్షత్రములకుఁగలదా?... అవిగో! ఆవులు అంబా యని అఱచుచున్నవి. పట్టుకుచ్చు వలె ముచ్చటగానున్న పచ్చికపై లేడిపిల్లలు చెంగుచెంగున దూఁకుచున్నవి పంచదార

వంటి ఇసుకపై టెంకాయపాలవంటి నీటితో సెలయేఱు పాఱుచున్నది వివిధ వృక్షములు శాఖాభుజంబుల పాంథులకు ఫలదానము సేయుచున్నవి. అదియే నా ఆశ్రమము. నీమృదు పదములకు నొప్పి కలుగకుండ పిల్లగాలులు దారిపొడవున పుప్పొడి చల్లుచున్నవి. తల్లీ! మెల్లగా లేచిరమ్మా.

చ॥ కుడిదెస పైఁడికంటిజత కూసె - శుభోదయమేమి యున్నదో-
నడవుము తల్లి! ఆశ్రమము నవ్యకళావృత పుష్పధామమై-
ఉడుగక స్వాగతం బొసఁగుచున్నది - కష్టములెల్లఁదీఱగా-
వడివడివచ్చు సౌఖ్యములవారిగ తామరతంపరై తగ॥

(లీలావతి వెనుక వచ్చుచుండ గానముతో నిష్క్రమించును)

[తెఱవ్రాలును]





# ప్రహ్లాద

## ద్వితీయాంకము

### ప్రథమ రంగము

స్థలము-మంథరగిరి

(సింహ శార్దూల భల్లూక వానరాది జంతువులు; పక్షులు పాములు సంచరించుచుండును. హిరణ్యకశిపుఁడు తపోనియమముచే శల్యావశిష్టుఁడైనట్లు కనఁబడును. అతని ననుసరించి కొంత భాగము పుట్ట పెరిగి యుండును పాములు వానిపైఁ బ్రాకుచుండును పక్షులు జడలపై వ్రాలి యెగిరి పోవుచుండును. ఇంతలో తపోవహ్ని విద్యుద్దీపపుఁ గాంతివలె పైకి లేచును) * ఆకాశమున *

వాణీమనోహరా! హిరణ్యకశిపుని తపోవహ్ని జ్వాలలు సత్యలోకమువఱకు వ్యాపించినవి. దుస్సహము... మేమింక నిలువఁ జాలము. రక్షింపుము.

(సత్యలోకమునుండి హిరణ్యకశిపునిపై పూలవాన కురియును. హంసవాహనారూఢుఁడై బ్రహ్మ ప్రవేశించుచున్నాఁడు)

బ్రహ్మ:- ఆహా! ఏమి ఈ వీరాగ్రణి తపోదీక్ష! అనన్య సామాన్యము. ఈ రక్షోవిభుండు మనశ్శిక్షాదక్షుండై హృదయ క్షేత్రంబున నా స్వరూపంబు నిల్పి నిరాహార దీక్షతో ఘోర తపంబొనరించుచు శల్యావశిష్టుఁడై యున్నవాఁడు. (ఉదకము ప్రోక్షించి) ఈ దివ్యజలంబులచే ఈతఁడు తన సహజస్థితిని పొందుఁగాక!

హిర:- (కన్నులు తెఱచి) పితామహా! నమస్కారము.

బ్రహ్మ:- వత్సా! వాతాతప వర్షంబులకోర్చి సకల లోక భీకరంబుగ ఉగ్రారణ్యంబున నీయొనర్చిన తపంబున కత్యాశ్చర్యమందితి ఇంతకు ముందెవ్వరును ఇట్టి తపంబు చేయలేదు ఇఁకముందు చేయఁబోరు. వలయు వరంబుల కోరుకొనుము. ఒసంగెద.

హిర:- తపఃఫల ప్రదాతవగు ధాతా! నీవాక్కు అమోఘము. నాకు పెక్కువరము లక్కర లేదు. రెండు వరములు మాత్రమే కోరెదను. దయతో ప్రసాదింపవలెను. నేను మృత్యువును జయించునట్లును, నన్నెవరును జయింపకుండునట్లును...... అనుగ్రహింపుఁడు.

బ్రహ్మ:- అసాధ్యము. మృత్యువును జయించినవాఁడొక్క మృత్యుంజయుఁడే. నేనీ వరములు ఈయఁజాలను. జీవులను నేను వ్రాసిన వ్రాతను నేనే చెఱుపఁజాలనట్లు అమ్మహాదేవుఁడు తాను మృత్యుంజయుఁడయ్యు అట్టిశక్తి ఇతరులకీయవలెనన్న తనకును అవకాశము లేదు. అది అంతియ. కాని నీవనర్హుండవని కాదు. ఇదితప్ప ఇంకేవరములైన ఇచ్చెద.

హిర:- మీరే అట్లనిన నేనింకేమనఁ గలవాఁడను. ఐన నో దేవా! దేవ యక్ష రాక్షస గరుడ గంధర్వ కిన్నర కింపురుష సిద్ధ విద్యాధరాదులచేఁగానిఁ నరులచేఁగాని వానరులచేఁగాని పక్షులచేఁగాని వృక్షములచేఁగాని నగములచేఁగాని పన్నగములచేఁగాని, విషాదులచేఁగాని, ఝషాదులచేఁగాని, నిప్పు చేఁగాని, నీరుచేఁగాని, గాలిచేఁగాని, ధూళిచేఁగాని ఇంటనైనను, ఇంటివెలుపలనైనను, భూమియందైనను, ఆకాశమందైనను, పగటివేళఁగాని, రాత్రివేళఁగాని, స్త్రీచేఁగాని, పురుషునిచేఁగాని, అస్త్రములచేఁగాని, శస్త్రములచేఁగాని చావు లేకుండునట్లును సర్వలోక సంచార యోగ్యంబును మహాభాగ్యంబును అనుగ్రహింపుఁడు.

బ్రహ్మ:- ఇచ్చితి. నీత్యాగదీక్షకు మెచ్చితి. వత్సా! కాశ్యపుండవగుట నీవును పరుండవు కావు. కాని, కన్ను తగులునట్టి పుల్లను కనిపెట్టి తిరుగుము. నీకు మేలుకలుగును. (అదృశ్యుఁడగును)

హిర:- కష్టము ఫలించినది. నాజన్మము తరించినది బ్రహ్మానంద మనుభవించితిని. నేను లేని సమయమున దానవలోక విష యము లెట్లుండెనో! దేవతలు దుర్మార్గులు, దురహంకారులు. కావున సత్వరమేగెద. (నడచును)

వ్యాఘ్ర
వజ్ర } ప్రభూ! రక్షింపుఁడు రక్షింపుఁడు (రక్తసిక్తాంగులై ప్రవేశింతురు)

హిర:- ఏమి మీా ఆపద? ఇచ్చటికేల నచ్చితిరి?

వ్యాఘ్ర:- మహాఘోరము చెప్పుటకు నోరాడకున్నది.

హిర:- ఘోరమా? అయిన త్వరగా చెప్పుము.

వ్యాఘ్ర:- సర్వసైన్యాధపతిశరీరాస్వస్థతచే ప్రభుత్వవైద్యాలయము నందు చికిత్స పొందుచున్న సమయమున హెచ్చరిక లేకయే ఇంద్రుఁడు మన నగరముపై దాడి వెడలినాఁడు.

హిర:- మంత్రాంగమునకు మంత్రియుండెనుగదా!

వ్యాఘ్ర:- ప్రభూ! శాంతింపుడు మీారు లేకుండుటయు సర్వసైన్యాధి పతి అట్లుండుటయు మంత్రి కోఱలుతీసిన పామయ్యెను. వట్టి బుసలు ఎన్నికొట్టిన ఏమిలాభము?

హిర:- తరువాత.

వ్యాఘ్ర:- నీవు చెప్పరా. [వజ్రదంతుని పురిగొల్పును]

వజ్ర:- తెలియనోణ్ణి నన్ను చెప్పమంటావేరా చదువుకొన్నాడవు. తెలిసినోడవు నువ్వుచెప్పరా.

వ్యాఘ్ర:- చెప్పరా బాబూ! నాగుండె కొట్టుకొనుచున్నది.

వజ్ర:- బాబూ! (వణకుచు) దండాలండి దండాలు.

హిర:- భయమువలదు చెప్పుము.

వజ్ర:- బాబూ! ఇంద్రుఁడు మనడబ్బు; సొమ్ము అంతా కొల్లగొట్టి అమ్మగారిని చెఱబట్టుకపొయ్యాడు.

హిర:- [తీక్ష్ణదృష్టిని ప్రసరించి] ఆ॥!
వజ్ర:- తెల్లని మునివస్తాఁడే మనింటికి .. పాటలు పాడుకొంటూ ..
వ్యాఘ్ర:- నారదుఁడు ప్రభూ! అమ్మగారి ఆర్తినిని మధ్యేమార్గమున నారదుఁడడ్డుపడి ఇంద్రుని నిందించి అమ్మగారిని విడిపించి తన ఆశ్రమమునకుఁ దీసికొనిపోయినాఁడఁట!
హిర:- మదపుటేనుంగులవోలె మదించియున్న మీబోటి సైనికు లందఱేమైరి?
వ్యాఘ్ర:- ప్రమత్తతచే అణఁచఁబడిరి ప్రభూ!
హిర:- నిజముచెప్పితివి కాన క్షమించితిని. (కోపముతో) ప్రమత్తత! నా ఉప్పుపులుసులం దినుచు నేను లేని సమయమున నా కుటుంబమును కాపాడలేని మీతనువు లుండిన నేమి యుండిన నేమి? (కమండలము నేలపైఁగొట్టి) ఓరీ ఇంద్రా! బెబ్బులి కోఁబనా పెఱికఁ జూచుట! పూలగుత్తియని కేలఁబట్టఁదలంచితివిరా? కాలసర్పమై నీప్రాణవాయువుల నపహరించునని తెలిసికొనుము. నీజీవిత విషాదాంత నాటకమునకు నాందీ ప్రస్తావనలు జరిగిపోయినవి. ఇఁక కథాఘట్టముజరుగనున్నది హరిహరాదులడ్డుపడినను అస్మదీయ హస్తసంశోభిత కరాళ ఖడ్గ ప్రహరణంబులచే నీకాయంబున గాయంబులుచేసి నెత్తుటేఱులు పాఱింపకున్న నేను హిరణ్యకశిపుఁడనా? నీస్వర్గపుర రాజమార్గములను శ్మశాన వాటికలు గావించి భూతప్రేత పిశాచాదులను తాండవ మాడింపకున్న నాకీకసి తీరునా? నీ యెట్టయెదుట నీ అంతఃపురాంగనలను బంధించి సభామందిరమున కీడ్చి తెచ్చి స్తంభములకు అంటగట్టకున్న నేనుదానవ సార్వభౌముఁడనా? చూడుము.

శా॥ ఒరీ పుణ్యజనారి! త్వత్కుటిల కార్యోద్భూత మతోద్ధ ధీ
పారావార తరంగ సంఘుజ రణౌర్వజ్వాల; నీ వాహినిన్
వీరావేశముఁ దాల్చిపీల్చి-పెలుచన్ విశ్వంబు కంపింప-నీ
సారంబంతయు లాగి త్రాగి-పిదపన్ శాంతించునంచెంచుమా?

వజ్ర:- [కమండలము భీతితో హిరణ్యకశిపుని చేతికందిచ్చును]
ప్రభూ! శాంతింపుడు... శాంతింపుడు.

వ్యాఘ్ర:- దేవా! నారదమహర్షి ఆశ్రమము ఇచ్చటికి సమీపమున నే యున్నది.

హిర:- మహర్షి... మహర్షి యన నారదునకే చెల్లును. అస్ఖలిత బ్రహ్మచారి, సర్వలోక సంచారి, నిర్వికారి. అట్టి మహాత్ముని ఆశ్రమముననుండగా నా సతికి అణుకాలున ముల్లు నాటదు. మంచిది. మునీంద్రా కృతజ్ఞుడను. [వ్యాఘ్రుపాదునితో] ఓయీ! అమ్మహర్షి ఆశ్రమమునకు దారితీయుము,

వ్యాఘ్ర:- ప్రభూ! ఇటు ఇటు. (తెఱవాలును)

ద్వితీయాంకము - ద్వితీయ రంగము

స్థలము - నారదుని ఆశ్రమము

(దర్భాసనంబున నారదుడు కూర్చుండి యుండును.
సమీపమున లేడి నెమరువేయుచుండును.)

నార:-

ఉ॥ ఎవ్వడు బ్రహ్మరూపమును-ఈజగమెల్ల సృజించుచుండునో-
ఎవ్వడు విష్ణువై- సిరత మీ భువనంబుల బెంచు చుండునో-
ఎవ్వడు రుద్రుడై -తిరిగి ఈసకలంబు నశింపజేయునో-
అవ్విమలాత్ము-లోకపతి-నాత్మదలంతు సుఖార్థినై సదా!

నార:- అమ్మాయీ! ఏమి చేయుచున్నదానవు?

లీలా:- (ప్రవేశించి) మునీంద్రా! దర్భలను కొఱుకుటచే మన లేడిపిల్ల మూతికి చిన్నగాయము లేర్పడినవి. ఆ గాయములు మాన్పుటకై ఇంగుదీ తైలమును పూయుచున్నదానను.

నార:- బిడ్డా! కూర్చుండుము. ఆయాశ్రమ వృక్షలతాదులకు నీవు నీరు పోయనక్కఱలేదు. నీ చెలులే ఆపనిని చేయగలరు.

లీలా:- సహజ కోమలములైన ఈ వృక్షలతాదులను చూచినపుడెల్ల నాకును వానినిపోషింపవలెనని కుతూహలము కలుగుచుండును.

నార:- అది నైజము. ప్రకృతి నిజముగా ఈశ్వర విలాసము.

ఈశ్వరుఁడైన విష్ణు సర్వవ్యాపి. సూర్యుండొక్కఁడయ్యు సమస్త జలాశయములందు తనరూపమును ప్రతిబింబింపఁ జేయునట్లు నారాయణుండు సర్వాంతర్యామియైయుండు. జీవుఁడు సనాతనుఁడు. జీవుఁడే దేవుఁడు. అట్టి జీవునకు చావుపుట్టుకలు లేవు. ఇది నా గృహమనినప్పుడు గృహము నేను కాదు. అట్లే ఇది నాశరీరమనినప్పుడు శరీరము నేను కాదని భావము. దేవత్వము రాక్షసత్వము గుణములనుబట్టి నిర్ణయింపఁదగినవే కాని జన్మమునుబట్టి కాదు. ఇది సత్యమైన వాక్కు. ఇందులకు ఋషుల జన్మములే తార్కాణములు. ఆ శ్రీహరిని సద్భక్తితో ధ్యానించు చుండిన సకలశుభముల బడయవచ్చును.

లీలా:- మహాత్మా! మీ అనుభవము అద్వితీయము.

వ్యాఘ్ర:- (ప్రవేశించి) స్వామీ! నమస్కారము. దానవ సార్వభౌముఁడు తమ దర్శనార్థము వేచియున్నాఁడు.

నార:- (లేచి) ఏడీ వచ్చినాఁడా? త్వరితముగ తోడ్కొని రమ్ము.

వ్యాఘ్ర:- చిత్తము. (లోనికేగును)

[హిరణ్యకశిపుఁడు సేవకులతోఁ బ్రవేశించు చున్నాడు]

హిర:- దేవర్షి సార్వభౌమునకు నమస్కరించు చున్నాను.

నార:- సద్వాంఛా ఫలసిద్ధిరస్తు.

లీలా:- జీవితేశ్వరా! ఈ మీచరణదాసి నమస్కరించుచున్నది.

నార:- వత్సా! నీవు కూర్చుండఁదగిన ఆసనములు మా ఆశ్రమమున లేనందుకు......

హిర:- స్వామీ! మీరట్లనరాదు. ఈ పర్ణశాలకు స్వర్ణసౌధములు సరితూఁగవు. ఈ దర్భవేదికకు రత్నాసనములు సమానములు కావు ఇచ్చట పరోపకారదీక్ష చేతనా చేతనంబులందుగూడ ప్రతిబింబించు చున్నది వృక్షములు తామెండలో నుండి బాటసారులకు నీడనిచ్చుచున్నవి. ఇది ప్రశాంతమైన పుణ్యభూమి. పులియు, లేడియు ఒక్కరేవున నీరు త్రాఁగుచున్నవి.

భగవంతుని సహజ సౌందర్యము ఈ ఆశ్రమ ప్రకృతి శోభా మూలమున సహస్ర ముఖంబుల విరాజిల్లుచున్నది ఈశ్వర సృష్టి వైచిత్ర్యమొక నీతిపాఠమును నేర్పుచున్నది ఇట్టి పవిత్రములైన ఆశ్రమములు చాలఅరుదు మహర్షీ! ధన్యుఁడను.

నార:- జరిగిన వృత్తాంతము తెలిసియే యుండవచ్చు.

ఉ॥ ఈ యమ పుణ్యరాశియని ఎంచక-ఇందుఁడు చేసినట్టి-అ
న్యాయము వేఱుగాఁదలపకయ్య! జగంబున ఎట్టివారికే
పాయు నె బ్రహ్మవ్రాఁత-తొలుబామున ఎవ్వరికేమి చేసెనో-
ఈ యవమాన మొందినది ఈ సతి; దీనిఁ దలంపఁ బోకుమా!

హిర:- మౌనిచంద్రా! మీయుపకారమునకు నేనేమిప్రత్యుపకారము చేయఁగలను? మీ ఋణమెట్లు తీర్చుకొందును? బ్రహ్మతేజము మీ ముఖమున తాండవ మాడుచున్నది. ఈ వనవాస క్లేశము మీరింకను అనుభవింపనేల? ఇచట మీ కొఱకై ఒక దివ్య సౌధమును కట్టించెద.

నార:- వలదు.

హిర:- చక్కని ఉద్యానవనము వేయించెద.

నార:- వలదు; వలదు.

హిర:- హంసతూలికా తల్పమును తెప్పించెద.

నార:- వలదయ్యా - వలదు.

హిర:- దాసదాసీ జనంబుల రప్పించెద. ఇంతయేల? త్రైలోక్య సింహాసనాసీనుం జేసి రత్నాభిషేకము చేసెద. ఆజ్ఞనిండు.

నార:- వలదు... దైత్యకుల తిలకా! వలదు. అట్టి భోగములన్నియు నీకే ఉండవలయును. సర్వసంగ పరిత్యాగులమైన మాకెందులకు తండ్రీ! ఇదిగో! మహాపతివ్రతయగు నీ భార్య సుఖముగ నున్నది. నీకప్పగించు చున్నాడను. ఇదియ నాకు సంతోషము అమ్మా! ఇఁక నీ భర్తగారి సమీపమునకు పొమ్ము.

లీలా:- (భర్తను డాయును) మహర్షిచంద్రా! తొలిచూలితోనున్న

ఈ కపిలవర్ణముగల గోవు ఎప్పుడు సుఖప్రసవమగునో అప్పు డావార్తను తెలుపుటకై ఎవరినైన పంపుడు.

నార:- ఈ విషయమును నేను మఱచిపోను.

ఉ॥ ఎంత దయార్ద్ర చిత్త వసురేశ్వరి! నీ సుకుమార గర్భమం
దెంత మహానుభావుఁడు జనించి-జగమ్మున మేలుఁగూర్చునో-
ఇంతకుముందు ఎవ్విధిని-ఎవ్వరు పొందని భోగభాగ్యముల్
కొంత కొఱంత లేక కలుగుణ్-కనువారల కన్నుగుట్టగా.

లీలా:- నాథా! ఈ పారికాంక్షే మన శుభాకాంక్షే.

హిర:- దేవా! నేఁడు మాయింటికి మీరలు అతిథులుగా దయచేయవలయును.

నార:- ఇప్పుడు రాను. మీకు చక్కని మగశిశువు కలిగి ఆ బాలుని ముద్దు ముచ్చటలతో మీరు కాలము గడుపు చున్నపుడు మీ ఇంటికి తప్పక వచ్చెదను.

గీ॥ పరమ భాగవతుండన పరగునట్టి -
పుత్రుఁడుదయింపఁ గలడు - మీపుణ్య గరిమ -
అతనిచే - దివ్యభోగము లందఁగలరు -
నిఖిల జగముల - మీకీర్తి నిండుకొనఁగ.

హిర:- }
లీలా:- } ధన్యులము. పోయివత్తుము.

[నమస్కరించి నిష్క్రమించు చున్నారు]

(తెఱవాలును)

ద్వితీయాంకము - తృతీయ రంగము

స్థలము - స్వర్గము

[ఇంద్రుఁడు సింహాసనాసీనుఁడై యుండును.
ప్రక్కన జయంతుఁడు కూర్చుండియుండును]

ఇంద్ర:- నాయనా! జయంతా! సైన్యాధిపతి యెక్కడ?

జయం:- హిరణ్యకశిపుని దండయాత్రా వార్త వినినంతనే అమరావతీ రక్షణార్థము సర్వసైన్యమును సంసిద్ధము చేయుమని అతని కాజ్ఞనిచ్చితిని. వెంటనే అతఁడు......

చ॥ సురగరుడోరగ ప్రముఖ శూరవరేణ్యుల-ఒక్క చోటికిన్
సరగున(గూర్చి-ఆ దనుజు సంగరరంగమునందు గెల్తునం
చరిగెను-దక్షిణాభిముఖు(డై-ఇ(క తక్కిన వీరులెందఱో
పురమున నాల్గుదిక్కులకు పోయిరి-వారల సంహరింప(గా

ఇంద్ర:- మంచిపనిచేసితివి. కాని ఈ దైత్యుని జయించు మార్గమేది? వాని సహజ శౌర్యమునకు వరబలము చేకూరుట అగ్నికి వాయువు తోడైనట్లున్నది. ఇంక మన కేది దారి?

జయం:- తండ్రీ! ఎందులకీ దీనాలాపము.

ఉ॥ ఆనతి యిచ్చిపంపిన-మహాహవభూమి-విరోధులందఱం
బూని వధించి-దిగ్విజయమున్ సముపార్జించెడి పుత్త్రుండనై-
నేనిట నిల్చియుండ-తగునే తమరి(తగ చింతనొంద-తం
డ్రీ! నను బంపు మీక్షణము-ఏగెద పెండ్లికి ఏగునట్లుగా.

ఇంద్ర:- జయంతా! నీవుపసివా(డవు. కాలానుభవము తక్కువ. సమయానుకూలమైన నేర్పుగలిగియుండుట రాజులకు క్షేమము.

చ॥ సమయముగాదు-శాత్రవుల సంగరమందు జయింప లేము-దు
ర్గములకు రాకమున్నె-తగ(బ్రాణము రక్షణగోరి-తల్లితో
శ్రమపడి కానకేగుమిక-శార్ఙ్గి కృపారసదృష్టి చూచినం-
గ్రమముగ రాజ్యభోగములు కల్గవె-తొల్లిటివోలె పుత్త్రకా!

(తెఱలో)

ఉ॥ దిక్కులు పిక్కటిల్లినవి-దేవతలెల్లరు దద్దరిల్ల(గా-
రిక్కలు పెక్కురాలినవి-రే(గిన దెబ్బకు దుమ్ము సుళ్లుగా-
ఉక్కిరి బిక్కిరైరి మనయోధులు-స్రుక్కె రథాలచాలు-కై
పెక్కి సురారి కుంజరు(డహీన రణస్థలి నిక్కియార్వ(గా.

సేవ:- [ప్రవేశించి లేక తెఱలో] దేవా! అసుర సేనలు తండోపతండములుగవచ్చి నగరప్రాకారములను ముట్టడించి మనవారల మట్టుపెట్టుచున్నారు. వారితో పోరలేక మన సైనికులు దాగికొనుచున్నారు.

జయం:- ఏమి విచిత్రము!

చ॥ రణము రణంబటంచు-రణరంగ విహారము సల్పునట్టి-అ
త్యనుపమ శౌర్య సాహస బలాన్వితులౌ మనయోధులెల్లరుం-
దినమణి దివ్య తేజమున-దిగ్భ్రమచెందెడి గూబలట్లుగా-
దనుజకులాగ్రగణ్యుగని-దాగుటకుంగల హేతువెద్దియో!

ఇంద్ర:- ఆహా! కాలమహిమ! ఈస్వర్గసింహాసనమునకును నాకు ఋణము తీరినది జయంతా! రహస్యమార్గమున అంతఃపురాంగనలను ఆచార్యాదులను తోడ్కొనిపోయి మేరుపర్వతమున నుండుము. అచిరకాలముననే మిమ్ము చేరఁగలను. పొమ్ము.

(తక్కినవారు నిష్క్రమింతురు)

సీ॥ ఎవ్వాని ముంగిట - ఇభరాజు చౌదంతి
వెండికొండ తెఱంగు వెలయుచుండు -
ఎవ్వాని అశ్వశాలేందిర కందమై -
ఉచ్చైశ్శ్రవంబు తా నొప్పమీరు -
ఎవ్వాని జలకేళి కెంతయు ననువుగా -
ఆకాశవాహిని అమరుచుండు -
ఎవ్వాని వనవిహారేచ్ఛకుఁ దగినట్లు -
నందనవనమే ఆనందమొసఁగు -

గీ॥ ఎవని యాస్థాన సీమను - సవినయమున -
అచ్చరలు ముచ్చటగ నాట్యమాడు చుందురి -
అట్టి దేవేంద్రుఁడిన్నాట ఆశవదలి -
అరుగు చున్నాఁడు - నేఁడు ఘోరాటవులకు.

హిర:- (తెఱలో) ఓరీ! దానవవైరీ! స్వైరవిహారీ!

(సపరివారుఁడై ఈక్రిందిపద్యమును చదువుచుఁ బ్రవేశించుచున్నాఁడు,

మ॥ తులువా! నీ తలఁ దన్నగాఁ దగిన దైత్యేంద్రుఁడత్యుదార ప్రభా
కలితుండై చనుదెంచినాఁడు-రణాకాంక్షన్ -మిత్రిచందాన-నీ
బలమున్ శౌర్యము సాహసంబిపుడు చూపం గాలమేతెంచె-త్వ
త్కులిశంబున్ గొనిరమ్ము-స్వర్గమిఁక నీకో నాకో దక్కున్ ఖలా!

[ఇంద్రుఁడు విచారముతో తలవంచికొనును]

ఏమి నీ నక్కవినయములు! దుర్మార్గుఁడా! నీకు పౌరుషము లేదా? పురుషజన్మము కాదా? పతివ్రతలైన నిండు చూలాండ్రపైకి సింహపరాక్రమమున లంఘించిన నీ ప్రతాపమిప్పుడేమైనదిరా? పర్వతపంక్తుల చ్ఛేదన ప్రభాసంశోభిత వజ్రాయుధంబును నాపై నొక్కసారి ఝుళిపింపుము లీలావతిపైనికాదు...... నాపైని. నీతో హోరాహోరిగఁ బోరాడవలయునని కొండంత ఆశతో వచ్చినాఁడను. నాచేతుల దురద ఎచ్చటను తీరలేదు. త్రిభువన వైరి వీరకంఠలుంఠన దీక్షాబద్ధకంకణ కరాళహస్తంబున జగజ్జేగీయమానంబుగ విజయలక్ష్మీకేశాకర్షణ దక్షంబగు ఈ హిరణ్యకశిపుని నవరత్న ఖచిత ఖడ్గంబును గనుఁగొనుము. వారెవా! యమదంష్ట్రిక వలె తళతళ మెఱయుచున్నది... రమ్ము.. ఆలసించిన వేడి తగ్గును... ఆశాభంగమగును... రమ్ము.

ఇంద్ర:- దైత్యచంద్రా! వరబలంబున సానదీఱిన రత్నశలాకవోలె ప్రకాశించుచున్న నీయెదుటనైన నిలుచుటకు సమర్థత లేదు.

హిర:- సమర్థత లేదు...సమర్థత! [విసపునవ్వు] ఏసామర్థ్యముచూచి నీకీ అమర సింహాసనమును అంటఁగట్టిరి? ఈ యధికారము జ్యేష్ఠులము శ్రేష్ఠులము ఐన మాయది ముందున్న చెవుల కంటె వెనుక వచ్చిన కొమ్ములు పైకిలేచినవి. ఆ హరికిని మునిముచ్చులకును గులాములువోలె సలాములు చేయుటచే మీకీ అధికారములు కల్గినవి. కాకున్న నీవుచేయుని దోషములు మా రాక్షసులేమిచేసిరో మచ్చునకొక్కటియైనఁ దెలుపఁగలవా? .. త్రాగుబోతులుమీరు (నవ్వు) కావున నే మత్తుపదార్థమగు సోమరసమును పానము సేయుచుందురు. పరస్త్రీలోలురు మీరు కావున నే ఇచ్చట వావివరుసలు లేవు. పరాన్నభుక్కులు మీరు. కావున నే బ్రాహ్మణోత్తములనాశ్రయించి యజ్ఞహవ్యాస్వాదనమునఁ దృప్తినొందుచుందురు. అధికార వాంఛతో నీవుచేయు నీచాతి నీచములైన పనులకు

మేరలేదు. ఎవ్వఁడేని పరమనిష్ఠాంగరిష్ఠుఁడై తపంబొనరించుచున్న ఈ నీ సింహాసనాధికారమున కెప్పుడు భంగము కలుగునో యని తాఁప్రకాండనై నీ రంభాద్యప్సరసలను వాని కడ్పించుచుందువు తపోభంగమునకిదియొక అమోఘాస్త్రము ఈ యస్త్రమే నిన్నింతవరకు రక్షించుచున్నది .. గుర్విద్ధి లోకము!... ఇట్టి మీలోపములను కనుఁగొనఁజాలక మమ్మే దూషించుచుందురు. ఈ దేవతలకును నీకును చక్కగ సరిపోయినది. సత్తుతాళమునకు కొయ్యమేళము...... ఏమి నీ ప్రత్యుత్తరము?

ఇంద్ర:- ప్రత్యుత్తరమేమున్నది ప్రభూ! మునికులకంటె మీ పలుకులే చులుకగానున్నవి మనలో మనకు భేదమేఁదుకు? ఈ సింహాసనమలంకరింపుఁడు.

హిర:- అబ్బా! అదియెక్కుటకు నూఱుయజ్ఞములు చేయవలయును గదా! అది నాకసాధ్యము. మఱియు గౌతముని ఇంటిపంచ కోడినై కొక్కొరోకోయని కూయవలయునుగదా. అదియు నాకసాధ్యమే.

విప్ర:- ఈతని వజ్రాయుధము మీయెడ వ్యర్థమైనది. గుర్విద్ధికన్ను మూసినను తెఱచినను ఒకటే. చచ్చినపామును చావఁగొట్టనేల? అనంతర కార్యక్రమమున కుపక్రమింతము

హిర:- వ్యాఘ్రపాదా! ఇంద్రుని బంధింపుము. [ బంధించును ] తక్కుంగల దిక్పాలకు లెక్కడ?

వ్యాఘ్ర:- తమ యాజ్ఞకై దూరముగా నిలిచియున్నారు.

హిర:- అగ్నీ! నీవు మాయింట వంటసేయవలయును. యమా! నీవు మానగరమున వైద్యుఁడవుగానుండవలయును. ఎవ్వఁడేని రోగగ్రస్తుఁడయ్యెనా నీపనిసరిపడ. నైఋతీ! నీవు మా వ్రజదంతుఁడు నియోగించు పనుల నెఱవేర్పవలయు. పవన వరుణులు మత్పుర వీధులను చిమ్మి నీరుచల్లవలయును కుబేరుఁడు తన ధనమంతయు నాస్వాధీనమొనర్పవలయును. ఈశాన్యుఁడేడీ!

ఆ యాదిభిక్షు వదృశ్యుఁడయ్యెనే! పోనిండు. ఇంద్రా! సకాలమున వర్షములు కురియవలయును అతివృష్టి అనావృష్ట్యాది దోషములు గలిగెనా నీ రసము నీరసమగును. ఇఁక జరుగబోవు యజ్ఞములు మదర్పితములుగా నుండవలయును. తెలిసినదా?... పొండు... (తన సైనికులంజూచి) త్రిమస్తక త్రిలోచన శకుని శంబర శతబాహు యగ్రీవ పులోమాది దైత్య దానవులారా! కపటనాటక సూత్రధారియైన ఆ హరి ఎందుండెనో యింతవఱకును కనఁబడలేదు. మీరు వైకుంఠమును గాలించి క్షీరపారావారమును కలయఁజూచి యజ్ఞములు ధ్వంసంబొనర్చి ఋష్యాశ్రమంబులు పాడుచేసి ఆ హరి ఎందుండెనో కనుఁగొనిరావలయు. విష్ణుభక్తులైన మునులను బంధించి ఆ హరి ఎచ్చటనుండెనో చూపుఁడని శాధించి చూపఁజాలకున్న బండోరుల గడ్డములకు ముడివెట్టి ఈడ్చుకొనిరండు. ఇదియే నా యాజ్ఞ

(నిష్క్రమించుచుండ తక్కినవారు నిలువఁబడి)

హిరణ్యకశిప మహారాజునకు జే!
దైత్యవంశపయఃపారావార రాకాసుధాకరునకు జే!
త్రైలోక్య సింహాసనాధీశునకు... జే!

(అనుచు నిష్క్రమింతురు)

[తెఱ వ్రాలును]

(త్రిమస్తక త్రిలోచన అని ఒక్కొక్కరిని పిలుచునప్పుడు లోపలనున్నవారు ఒక్కొక్కఁడు అయ్యా!, ప్రభూ!, స్వామీ,! చిత్తము; మొదలగు పదములతో అచ్చటనున్నట్లు సూచింపవలెను)






## ప్రథమ రంగము

హిరణ్యకశిపుని అంతఃపురము

(పుష్పడోలిక - పిల్లల ఆటవస్తువులు - ఒక నిలువుటద్దము - రెండు సోఫాలు - ఉండును. పాటపాడుచు పూలమాలనల్లుచు లీలావతి ప్రవేశించి సోఫాపై కూర్చుండి పాట పూర్తికాగానే లోపలనున్న ప్రహ్లాదుని జూచి చేతులు చాపుచు)

గీ॥ రారా! అసుర కిశోర! రారా కుమార!
రారా! కమనీయ తేజ! రారా తనూజ!
రారా వంశప్రదీప! రారా సురూప!
రారా ప్రహ్లాద! రత్నాలరాశిరార!

(ప్రహ్లాదుడు ప్రవేశింప లీలావతి ముద్దుపెట్టుకొని)

ఉ॥ చిక్కని పాలవాసనలు చిందెడి - నీ రతనాల నవ్వులో
నక్కిన భావజాలములు - నాకువచింపఁగ రానివన్న! నీ
చెక్కిలి నొక్కి ముద్దుగొని - చింతలఁబాసితివన్న - ఎన్నఁడీ
వెక్కడో సింహాపీఠమదియే కనఁగోరుదునన్న పుత్రకా!

నాయనా! ప్రహ్లాదా! ఇంతసేపెచ్చటనున్నాఁడవు తండ్రీ!

ప్రహ్లా:- ఇక్కడనే ఉన్నాను మనదాది నాకు హాయిగా నీళ్ళుపోసినది. పిల్లలతో ఆడుకొనుచున్నాను. నాకు రెండు పాటలు వచ్చునమ్మా!

లీలా:- ఏమి పాటలయ్యా నీకువచ్చినవి. ఏవి పాడు.

ప్రహ్లా:- ఇప్పుడు కాదు. నాకు నిద్రవచ్చుచున్నది, జోలపాడెదవా అమ్మా!

లీలా:- అట్లేపాడెదను, పరుండుము నాయనా.

[ప్రహ్లాదుఁడు డోలికలో పరుండును—పాట]

సకల సద్గుణ ధామ – సంగ్రామ భీమా
సుకవి సన్నుత నామ – సూరిజయ కామా॥ లాలీ॥
కరుణారసరుచిహాస – కైలాసవాసా
గిరిజా మనోభాస – కేళీవిలాసా॥ లాలీ॥
బాలచంద్రకిరీట – భాస్వల్లలాటా
పాలింపుమా బాలు – భక్తజనకూటా॥ లాలీ॥

[జోలపాడుచుచుండ హిరణ్యకశిపుఁడు ప్రవేశము]

హిర:- (చిఱునగవుతో) దండలల్లుచున్నావు.........ఈశ్వరునకా?

లీలా:- కాదు... హృదయేశ్వరునకు — ఈశ్వరారాధనము ప్రాతఃకాలమున జరిగినది. [భర్త మెడలో దండ వేయును]

హిర:- ఎందులకీ బహుమానము?

లీలా:- (నవ్వి) వీరవిహారమునల్పి విజయలక్ష్మీ సమేతులరై విచ్చేసినందులకు.

హిర:- అధికారము – అర్జన ఉన్నప్పుడు అందఱు గౌరవించువారే! (మాలఁదీయఁబోవఁ గత్తిపిడికిఁదగిలి తెగును. లీలావతి ముఖమున వికారము గన్పించును. తెగినదానిని గొంకికితగిలి-చి) దానికేమి... ప్రేయసీ! ప్రహ్లాదుఁ డేమిచేయుచున్నాఁడు.

లీలా:- నిదురపోవుచున్నాఁడు.

హిర:- ఈచిఱుతని వచ్చిరానిమాటలు వినవలయునని వచ్చినాఁడను.

లీలా:- కృతార్థురాలను చంద్రుఁడుదయించిన రాత్రివలె మన

గృహామిప్పుడు ప్రకాశించుచున్నది. ఎన్ని భోగ భాగ్యము, లున్నను ఇంత మగశిశువులేని గృహము కళా శూన్యము. ఇది యంతయు పరమేశ్వరుని దయ. ఆ ఇచ్చిన దేవుడు మఱచిపోయిన అంతేచాలును.

హిర:- స్త్రీలకు సంతానవాంఛ సహజము. లీలావతీ! నేనింతమాత్రమునకే సంతోషింపను. వీడు జగద్విఖ్యాత పరాక్రమోపేతుడై తండ్రిని మించిన శౌర్యశాలి యని అనిపించుకొనినపుడు ఆనందమున తలనూపెదను. ఇప్పుడు నీవు వీరపత్నివి. అప్పుడు - నీవు వీరమాతవు.

లీలా:- మఱచితిని. నాథా! మీరు స్వర్గముపై దాడి వెడలినపుడు నారద మహర్షులు వచ్చి ప్రహ్లాదుని చాలసేపు ముద్దులాడి వెళ్ళిరి.

హిర:- అతిథి సత్కారమున నేనులేని లోటు లేదుగదా!

లీలా:- లేదు. విజయానంద కేళీలోలతచే మీ రణరంగమే అంతఃపురముగ నున్నతఱి, మీరాకకు ఎదురుచూచుచున్న నాకు అంతఃపురమే రణరంగముగానున్నది.

మ॥ ఎలప్రాయమ్మున ప్రాణవల్లభునితో ఇచ్ఛావిహారంబులం
దలరంజాలిన యింతినోచినది నోమా కాని, మాబోంట్లకా
ఫలమెబ్భంగి లభించు? క్షాత్రమున దుర్వారక్రియా శీలురై
కలనింజొచ్చెడి రాజులేడ? ఇహసౌఖ్యంబేడ? యోచింపగా.

ఏకాంతమందైనను మీతో స్వేచ్ఛగా మాటలాడుటకు నాకెంతయో భయముగానుండును.

హిర:- కారణము?

లీలా:- క్షమింపుడు. తేజస్వంతమైన మీ ముఖలక్షణము. నాకే కాదు......

హిర:- నిజము. కాని అప్రతిహత రథికాగ్రేసరుండగు ఈ హిరణ్యకశిపుని తేజశ్శౌర్య సాహసంబు లెంత దుస్సహాంబులో ఈతని ప్రేమయు అంత అమోఘము; అంత అపారము. ఏ

గాలి నిప్పులను చెఱఁగునో ఆ గాలియే కుంభవర్షమును కురిపించును. అన్ని పుష్పములపై ఝుంకారముసేయు తుమ్మెద సంపెంగ సమీపమున పోకపోవుట ఎఱుఁగవా? ప్రేయసీ! శశికిరణ స్పర్శంబున చంద్రకాంత శిలవోలె నీ సాహచర్యమున నా హృదయము దయార్ద్రమగుచుండును.

లీలా:- మీ ప్రేమను ముందే గ్రహించితిని, లేకున్న మీయెదుట నైన నిలువఁగలనా?

ఉ॥ నీ చిఱునవ్వు వెన్నెలల నిగ్గులోన - చకోరపక్షినై -
ఈ చరియించు ఒక్కక్షణమే-అమృతంబును త్రాగుచుందు-నా
నోచిన నోములన్నియు మనోహర! నేడుగదా ఫలించె-ఈ
రాచసిరుల్ - త్వదీయ భుజరక్షణచే - ఒకవన్నె పొందవే?

హిర:- సతీ! నీ శీలమే నిన్ను రక్షించినది. నీస్ఫురద్రూపమే నన్నాకర్షించినది, (సంభ్రమముతో) ఏమది? కుఱ్ఱవాఁడు కలవరించుచున్నాఁడు. [ఊయెలదగ్గరకు పోవుచుందురు]

ప్రహ్లా:- నారాయణ! నారాయణ! హరీ! కృష్ణా!

[హిర-లీలా ఒకరిమొగమొకరు చూచుకొందురు]

లీలా:- నాయనా! మాచిన్నితండ్రీ! ఏమీ కలవరింత? ఎచ్చటనైన జడిసికొంటివా?

హిర:- నారాయణ!......... ఈపదము ఈతనినోటికెట్లలవడినది? చిత్రము దేవీ! ఏమది?

లీలా:- ప్రపంచమెట్టిదో ఎఱుఁగని యిట్టి పసిపాపలకు భగవంతుండు కనపడుననియు, అప్పుడే వారు తమలోఁదాము నవ్వుకొనుట మాటలాడ ప్రయత్నించుట జరుగుననియు పెద్దలనుకొనుట మీరును విని యేయుందురు. ఒకవేళ తోడి బాలురెవ్వరైన పరిహాసమునకు "బూచి" యని, దేవుఁడని, దయ్యమని బెదరించిరేమో! లేనిచో ఇట్లేల కలవరించును? అదుగో! నిదురించుచున్నాఁడు.

హిర:- (ఆసనమునఁ గూర్చుండును) నేను ఆ వైకుంఠమునకు సైన్య

సమేతుఁడనై వెళ్ళినప్పుడు పాఱిపోయిన విష్ణువు ఎచ్చటనైన పడిచచ్చి భూతమై ఈతనిని పట్టుకొనెనా?

లీలా:- [పతిని సమీపించి] ఇది స్వల్పవిషయము. మీరెందు కింత బాధపడెదరు నాథా - శాంతింపుఁడు. మనోహరా! రెండు విషయములు మీతో మనవి చేసికొనెదను

హిర:- అవశ్యము.

లీలా:- వైరులను జయించినను, వైరిస్త్రీలను బంధింపరాదని సైనికుల కాజ్ఞనీయవలయును.

హిర:- ఇది అంగీకరింపఁదగినదే! ఎవరిపక్షము వారు కాపాడుకొనఁ జూచుట సహజము. పూర్వమువలె మన చెఱసాలలో వైరి స్త్రీలు ఎవ్వరును లేరు మఱి రెండవవిషయమో?

లీలా:- తమరు కోపగింప ననినచో చెప్పెదను.

హిర:- అట్లే

లీలా:- ముల్లోకములను జయించితిరిగదా!

హిర:- అవును.

లీలా:- ఇఁక మీరు దండయాత్రలను మానుకొని ప్రశాంతముగా వినోదములతో విలాసములతో కాలము గడుపవలయునని.

హిర:- ఇది నేనంగీకరింపఁదగిన విషయము గాదు. వీరులు తుచ్ఛములైన కామాదిభోగముల ననుభవించుటే పరమావధియని ఎన్నఁడును తలంపరు. అమూల్యమైన కాలమును వృథ సేయరు, గమ్యస్థానము చేరనిదే నా ప్రయాణము మానుకొనుమనియెదవా?

లీలా:- మీ సంకల్పము దురూహ్యము.

హిర:- దురూహ్యము. దుర్భేద్యము. [క్రోధముగ] అసురద్వేషియైన హరి, ఆ మాయావేషధారియైన విష్ణువు నాకంటబడు నంతవఱకు శాంతి యెక్కడిది?

లీలా:- శాంతిలేనిచో సౌఖ్యము లేదు నాథా!

హిర:- ఆ రాక్షసవంశ మహాపకారియైన హరిని హతమొనరించిన

నాకన్నియు సౌఖ్యములే. ప్రియసీ! నాకు పిచ్చికి మందు పోయకుము.

ప్ర:- హరి! నారాయణ! [అనుచు లేవ లీలావతి యెత్తుకొనును] నాయనా! నేను రెండుపద్యములు నేర్చుకొంటిని.

హిర:- అప్పుడే పద్యములుగూడ నేర్చుకొంటివా? ఏదీ, ఒక్కపద్యము పాడుము. [లీలావతి భర్తతొడపై ప్రహ్లాదుని కూర్చుండపెట్టును]

ప్ర:-

గీ॥ ఆది మధ్యాంత రహితు-కళ్యాణ సహితు-
సర్వముని గణ నుతరూపు శార్ఙ్గచాపు-
విష్ణు-రోచిష్ణు-జిష్ణు-సహిష్ణు-కృష్ణు
తలఁతు మనసార-పాపముల్ తొలఁగిపాఱ.

హిర:- ఈపద్యము నీకెవరు నేర్పినారు.

ప్ర:- నాకిదివఱకే వచ్చు నాయనా!

హిర:- దేవీ! నీపరిమత్తతకు తగిన ఫలముకలిగినది.

లీలా:- (భయముతో) క్షమింపుఁడు (ప్రహ్లాదునితో) ఇట్టి పద్యములు పాడకుము తండ్రి!

ప్ర:- అమ్మా! నేనొక క్రొత్తపాట పాడెదను, ఇది మంచిపాటతల్లీ!

లీలా:- మంచి పాటలు పాడెదవా? నన్నుకన్న తండ్రి! వట్టిపాటలు పాడకుము.

ప్ర:- వట్టిపాటలు కావే. గట్టిపాటలే. [హరిపేరెత్తబోవ]
[లీలావతి ప్రహ్లాదుని నోరుమూయును]

హిర:- గీ॥ ఇంగితజ్ఞాన మిసుంత ఎఱుగనట్టి-
నీకు హరిభక్తి - ఎవ్వరు నేర్పినారు?-

ప్ర:- ఎవ్వరో నేర్పగని తమరెంచులేల-
సాధువులకిది సహజంబు - సార్వభౌమ!

హిర:- ఓరీ శుంఠా! — పాట —

తగున హరినెంచగా బాలక! మతివిహీనతన్ వెఱువకిఁక॥ తగు॥
నీదు బుద్ధియే మఱలకపోనీ - నీదుదైవమును సాయముకానీ

వీరధర్మమే నొనర్తు తునిమెద - విష్ణునైన గిష్ణునైనగానీ॥ తగు॥

లీలా:- నాథా! కోపగింపకుఁడు...పసివాఁడు, నేను వీనికి నెమ్మదిగా మనమతమును బోధించెదను.

ప్ర:- కోపగింపఁదగిన విషయమేమున్నది? జనకా!

సీ॥ గజరాజవరుని - భజనచేయుటకంటె -
అన్యచింతలిఁకేల - అసురనాథ! -
వైకుంఠవాసు సేవాభాగ్యమున కంటె -
పరమార్థ మింకెద్ది ప్రిభువతంస! -
హరినామ సంకీర్తనానందమున కంటె!
ఇహపరసౌఖ్య మింకేది తండ్రి!
అచ్యుతుపాదము లాశ్రయించుటకంటె -
అమరత్వ మెయ్యది అమరవైరి!

గీ॥ కాన, అతని, మనసారగా స్మరింప -
జన్మము తరించునని చాల సంతసింతు -
అంతియేకాని - నీకెదురాడు తలఁపు -
లేశమేనియు - ఆత్మలో లేదు జనకా!

హిర:- ఎంత మృదువుగా సమాధానించితివిరా. ఆదినుండి దైత్య దానవ విరోధియైన యీ హరియీ నీకు దేవుఁడు, అస్మద్వంశమున స్వజనద్రోహి పుట్టునని కలనైనఁ దలంపలేదు.

చ॥ కులగురు విట్టిబోధమును గూఢముగా నొనరించి పంపిరా
తెలియక వైష్ణవుల్ పలుకు తియ్యని పల్కులఁజిక్కి వారి య
ట్టుల మనఁగోరు చేనదియెటుల్ దగు నీకుఁ గుమారా! నక్క తా
పులిఁగని వాతపెట్టుకొను పోలిక చాలిఁకఁ గట్టిపెట్టుమా,
చూఱు ముట్టుకొన్న అగ్ని నడికొప్పునకు రాకమానునా?
కాలము జరిగిన గోటితో పోవుదానికి గొడ్డలి కావలెను.

లీలా:- కుఱ్ఱవానికి దురభ్యాసములు పట్టుపడకుండుటకై గురుకులాశ్రమమున చేర్పించుట మంచిదిగదా!

[తెఱలో గంట మూఁడు సారులు కొట్టఁబడును]

హిర:- దేవీ! మోసలనున్న గంట మూఁడుసారులు మ్రోఁగినది. నేను హితులతో కొంతమంతనము జరుపవలసియున్నది నీవు ప్రహ్లాదుని తీసికొని లోనికేగుము. (ప్రహ్లాదునితో లీలావతి లోనికేగును. మధ్యముననున్న తెఱ వేయవలెను.) వ్యాఘ్రపాదా!

వ్యాఘ్ర:- (ప్రవేశించి) దేవరవారి యాజ్ఞ.

హిర:- మంత్రిగారిని, చండామర్కులను తోడ్కొనిరమ్ము?

వ్యాఘ్ర:- చిత్తము. (నిష్క్రమించును)

[విప్రజిత్తు, చండాచార్యులు ప్రవేశించుచు]

చండా:- సార్వభౌములకు జయమగుఁగాక!

హిర:- (సింహాసనమలంకరించి ; ఈ యాసనము లలంకరింపుఁడు. మంత్రిపుంగవా! మన పరిపాలనము ప్రజానుకూలముగ నున్నదా?

విప్ర:- ఉన్నది ప్రభూ! కాని మనవైరులగు వైష్ణవ భక్తాగ్రేసరులు కొందఱు మనలను గూర్చి దుష్ప్రచారములు చేయుచు నే యున్నారు.

హిర:- ఉన్నారా? ఇంకను మన రాజ్యమున విష్ణుభక్తులున్నారా? అటులైన మీరు దానికిఁదగినచర్య నేలతీసికొనరు?

విప్ర:- వారు బయటకు మాత్రము చలిచీమనైనను చావదొ్రక్క నట్లు కనబడుదురు. గర్భమున విషజ్వాలలు ప్రజ్వరిల్లుచుం డును. వారు మనలో మనకు భేదాభిప్రాయములు కల్పింప వలయునని శతవిధంబులఁ బ్రయత్నించుచున్నట్లు గూఢచారుల వలన వినియున్నాఁడను.

హిర:- మొదటినుండి వీరియెత్తులు ఇవియేగదా?

విప్ర:- ఔను. వారికి దేవతలందఱు తోడ్పడుచుందురేమో?

హిర:- దేవతలు......ఇంద్రాద్యదిక్పాలకులను నణచివైచితినిగదా! ఇంకెక్కడి దేవతలు.

చండా:-బిడ్డచచ్చినను పురిటికంపుమాన లేదు. వారియాధిపత్యములు

నశించినను వారి కుటిలు చావలేదు. ప్రభూ! మనలను మాంసాహారులమని, రాత్రించరలమని, అనాగరికులమని, ఘోరాకారులమని హేళన సేయుచుందురు.

హిర:- (తలనూపుచు) మంచిది

విప్ర:- ఇంద్రుని జయించినంతమాత్రముననే మనము తృప్తిబొందుట తగదు. ఆతనినిమించిన యధిపతులింకను గలరు.

చండా:- ఔను. ఇంద్రుఁడు సరియైన యుద్ధవీరుఁడు కాడు. వాఁడుమన వారితో ఎట్టయెదుట నిల్చి ఎప్పుడు పోరాడినాఁడో యోచింపుఁడు. సమయమునకు ఎవ్వరేని ముందుంచి తాను వెనుకదాగును. త్రిపురాసురులను త్రిలోచనునిచే చంపించుటెఱుఁగరా?

విప్ర:- మఱియు తారకాసుర పద్మాసురాదులను కుమారస్వామిచే హతము చేయించుట వినియుంటిరిగదా!

హిర:- అట్లైన పూర్వమునుండి మనవారిచేపూజింపఁబడు శంకరునకును మనయందు దయలేనట్లేగదా! ఇఁక మనవారు శివుని గూడ పూజింపవలసిన పనిలేదు. ఆశ్రయించినవారిని అణగఁద్రొక్కువాఁడు దేవుఁడుగాఁడు; దయ్యము.

విప్ర:- కాదు. మనదేవుఁడును మనవంటివాఁడే. వట్టిఅమాయకుఁడు, కల్లయు కపటమెఱుంగని దేవుఁడా శంకరుఁడు ఇకఁ దేవతలకు కామితార్థములొసఁగు కల్పవృక్షము వంటివాఁడు విష్ణువు. ఆతని అండచూచుకొనియే వారు మండిపడుచుందురు. కావున ఆ వైకుంఠవాసుని జయించినచో దేవతల వంశవృక్షమును ఆమూలాగ్రముగ పెల్లగించినట్లే.

హిర:- ఆచార్యా! కుశాగ్రబుద్ధి యగు మనమంత్రిగారి ఊహాకడుంగడు సమంజసము. అదియునుంగాక నాకు సోదరుండును మీకు స్నేహితుండును దైత్యకులాలంకారుఁడును ఐన హిరణ్యాక్షుని మాయావరాహ రూపధారియై హరివధించెనుగదా! మాయావియగు నాతఁడెందుండెనో యింత వఱకు నాకంటఁ

బడలేదు. ఆతనికి నాకును కలయిక కలుగుటెట్లు? దేవతల రక్తముచే తర్పణ మొనరింపకున్న నా సోదరుని యాత్మకు శాంతికలుగునా? కావున, హరినన్వేషించుటయందు మీరం దఱు అప్రమత్తులై యుండుఁడు.

విప్ర:- దేవరవారి ధాటికి నిలువఁజాలక తలఁదాచుకొనుటకు ఆ హరి దిక్పాలకాదులతోఁగూడి మేరుపర్వతమునకో, కైలాసగిరికో అరిగియుండవచ్చు.

హిర:- వారికిదియే ఘోర ప్రతీకారము.

విప్ర:- నిజము క్షీరసాగర మథనకాలమున రాక్షసులకెట్టి అన్యాయము జరిగినదో గ్రహించితిరా? అదిఅంతయు వైష్ణవమాయ

హిర:- ఏమది?

విప్ర:- పాలసముద్రమును చిలుకునప్పుడు మంథరాచలమును కవ్వముగను వాసుకిని కవ్వపు త్రాడుగను అమర్చిరి. విష్ణువు తాఁబేలై కొండక్రింద నుండెను. వాసుకితలను రాక్షసులును, తోఁకను దేవతలును పట్టుకొనునట్లు ఏర్పాటుచేసి మథించుచుండ సర్పవిషానలజ్వాలల కెందఱో రాక్షసులు భస్మమైరి. అప్పుడు మనవారు పడినబాధ పరమేశ్వరున కెఱుక.

హిర:- వీరేల దాని కొప్పుకొనిరి?

విప్ర:- ఎట్లైనను అమృతము లభించునుగాదాయని.

హిర:- తరువాత?

విప్ర:- తానొకటి తలఁచిన దైవ మొకటి తలంచెనన్నట్లు మొదట హాలాహలము జనించినది. ఆ విషానలజ్వాలా ప్రసరణంబునకు సర్వలోకములు దహించునని విష్ణు బ్రహ్మాది దేవతలందఱు కైలాసగిరికరిగి సర్వేశ్వరుని శరణుఁజొచ్చిరి. వెంటనే మృత్యుంజయుఁడు హాలాహలమును మ్రింగెను. పిదప లక్ష్మీదేవియు, శంఖచక్రాదులును జనింప విష్ణువును, ఉచ్చైశ్శ్రవాప్సరః కల్పవృక్ష కామధేన్వాదులు జనింప ఇంద్రుఁడును గైకొనిరి. చివరకు అమృతము పుట్టెను. దానిని పంచుటకై హరి జగన్మోహినియై రాక్షసులను మోసగించి అమృతము

నంతయు దేవతలకే ఒసంగెను. ఇంత కష్టపడిన రాక్షసులకు ఒక్క చుక్కయైన లభింపలేదు...... ఒక్క చుక్క . . . .

హిర:- ఆహా! ఎంతఘోరము! ఎంతఘోరము!!

విప్ర:- మంచి వస్తువులన్నియు దేవతలపాలు. విషము మనదేవుని పాలు, వట్టిచేతులు మనపాలు ఇట్టి మోసములన్నియు వారి విజయములుగ పరిణమించుటకు కారణము లేకపోలేదు. గొడ్డలిలో కఱ్ఱయుండుటచేతనే అడవి నఱకఁబడుచున్నది. మనవారగు నైఋత్యాదులు సమర్థులయ్యు వారికి దాసానుదాసులై వర్తించుచు మనరహస్యములన్నియు వారితో చెప్పుచుందురు ఇప్పుడు వారేదియో క్రొత్త వ్యూహము పన్నుచుండవచ్చు. దేవతలు మంత్రి తంత్రి యంత్రి మర్మజ్ఞులు.

హిర:- సచివాగ్రణీ! నామనస్సునందొక్కయనుమానము జనించినది. కుఱ్ఱనికెవ్వరో హరినామము బోధించిరి.

విప్ర:- హరినామమా? [కోపముతో] ఎవఁడా దురాత్ముఁడు? ఇంటఁదిని యింటివాసములు లెక్కించుటయా? కనిపెట్టెద, కాని రాజనగరమున అట్టివాఁడెవ్వఁడును లేఁడే!

హిర:- ఎట్లుజరిగినదో! ఇంటిదొంగను ఈశ్వరుఁడైనను పట్టలేఁడుగదా!

చండా:- పట్టలేఁడా? జగజ్జేతా! అట్టి రాజద్రోహిని కనిపెట్టువఱకు నేనహోరాత్రములు త్రికరణశుద్ధిగా పనిచేసెద పరుల యభ్యున్నతింజూచి పరితపించు పందల పనిపట్టకమానను.

హిర:- ఏదారిలేక యీదారి దొక్కినారు...... కానిమ్ము. సర్వశాస్త్ర పారంగతులు బ్రాహ్మణోత్తములు భార్గవులు ఐన మీకంటె మాకు హితులెవ్వరు? విద్యాభ్యాసమునకై ప్రహ్లాదుని మీకర్పింతును తగినరీతిని విద్యాబుద్ధులుగఱపుఁడు.

చండా:- మహాభాగ్యము.

హిర:- మంత్రీ! ప్రహ్లాదుని విద్యాభ్యాస మహోత్సవమునకు వలయు సన్నాహములు చేయింపుము.

విప్ర:- చిత్తము వ్యాయామక్రీడా వినోదమునకు వేళయైనది.

హిర:- మంచిది. (అందఱు నిష్క్రమింతురు) [తెఱవ్రాలును]



# ప్రహ్లాద

## చతుర్థాంకము

### ప్రథమ రంగము

— పాఠశాల —

[దర్భాసనములు – ఒక వ్రాతబల్ల – తాళపత్ర గ్రంథములు మొదలగునవి యుండును. విద్యార్థులు, చండాచార్యులు ఉందురు వింత రూపముతో మొద్దబ్బాయి యుండును]

చండా:– ఓరీ! కుఱ్ఱవాఁడా! నిన్నటిపద్యమును సరిగా అప్పగించుము.

1 బా:– ఈపిల్లవాఁడు గోలికాయలు తెచ్చాడండి బెత్తులన్నీ బొడ్లో దోపుకున్నాఁడు.

2 బా:– పంతులుగారూ! (ఒకనినిచూపి) వీనికి ఎక్కములురా లేదండి.

చండా:– (ఆబాలుని) చెప్పుము. ఐదవఎక్కము చెప్పుము.

(వాఁడు సరిగా చెప్పును)

3 బా:– వీనికిగాదండి. (మొద్దబ్బాయినిజూపి) వీనికండి.

చండా:– (ఏదియో వ్రాసికొను చుండును)

1 బా:– పంతులు గారూ! (మొద్దబ్బాయిని జూపి) వీఁడగఁటిపండ్లు తెచ్చుకొని తింటూ మమ్మల్ని ఊరిస్తున్నాడండి ఇందాక నాకు చీమిడి రాశాడండి.

2 బా:– ఎంగిలిచేయి నాకు రాస్తున్నాడండి. అదిగో మళ్ళీ గోచీకి తుడుచుకుంటున్నాడండి. అరఁటికాయ బొడ్లోదోపుకున్నాఁడు.

చండా:– ఏమిరా ఏమది?

మొద్దు:- లేదండి. వీళ్ళకి పెట్టలేదని నామీద చాడీలు చెపుతున్నారండి. అన్నీ తినేశానండి.

2 బా:- అదిగోనండి చేతిలో.

చండా:- [కోపముతో] లెమ్మా. నిన్నటిపద్యము నప్పగించుము.

మొద్దు:- [ఒకపద్యములోనిది సగము మరియొకపద్యములోనిదిసగము అప్పగించుచు చేయినాకుకొనుచుండును]

చండా:- పో మొద్దూ! తుమ్మమొద్దూ! ఆబావిదగ్గఱ చేతులు కడుగుకొనిరమ్మా. (మొద్దబ్బాయి నిష్క్రమించును. ప్రహ్లాదుడు ప్రవేశించును)

ప్ర:- హరినామ స్మరణానంద పారవశ్యమున ఇంచుక ఆలస్యము జరిగినదిగురూ! క్షమింపుడు.

చండా:- ఎప్పుడు నీకు హరినామమే. చెప్పినపాఠము లెప్పుడు కంఠస్థము చేయుదువు?

ప్ర:- నాకు ముందే కంఠస్థములై యున్నవి. కాని మోక్షమార్గాన్వేషణము లేని చదువులెన్ని చదివినను ఏమిలాభము. దానికి భక్తి ప్రథమ సోపానము.

సీ॥ నిస్సార సంసార నీరధి దాటునే -
నారాయణుని దయానౌక లేక -
ఘనమైన మాయాంధకారంబు పాయునే -
చక్రి సంస్మరణ భాస్కరుడు లేక -
చెలగి తృష్ణాలతాచ్ఛేదంబు కలుగునే -
కంజాక్షు భక్తి ఖడ్గంబు లేక -
దురితదోహద చిహ్న దుఃఖాగ్నులడగునే -
విష్ణుగానామృత వృష్టి లేక -

గీ॥ అష్టమద పర్వతంబుల నణచగలమె -
దనుజరిపుభక్తి వజ్రాయుధంబు లేక -
శుద్ధశూన్య గగనమున చొరగవశమె -
అంబుజోదరు జప విమానంబు లేక.

1 బా:- పంతులుగారూ! మీరు లేనప్పుడు మమ్మలనుగూడ హరి

భజన చేయమంటాఁడండి. అమ్మయ్యో! పంతులు గారు కొడతారు. మేము చేయమంటామండి.

చండా:- ఓయీ ప్రహ్లాదా! తాను చెడ్డకోఁతి వనమెల్లఁ జెఱచినట్లు నీతోఁబాటు వీరినిగూడ పాడుచేయఁదలంచితివా? ఇది రాక్షస వంశమునకుఁ గళంకము.

ఉ॥ తప్పకుమయ్య దానవులదారి-మహారి-హరిన్ గిరిజా సదా
చెప్పకుమయ్య-దైత్యులకు చేటొనఁగూర్పఁగ తోడిబాలురన్
త్రిప్పకుమయ్య-చెప్పితిని తిన్నగ-నీ జనకుండు విన్నచో
నిప్పులు గ్రక్కు-నయ్య-జన నిందకు పాల్పడకయ్య బాలకా!

ప్ర:- గురూ! ఆ శ్రీహరి పరాత్పరుఁడు. కరుణాకరుఁడు. ఆ భగవంతుని భజించుచో మనము ఐహికాముష్మిక సుఖంబులను పొందవచ్చును. ఇది మనకు కళంకము కాదు కళాంకము.

ఉ॥ ఎవ్వఁడు విష్ణురూపమును-హృత్కమలంబున నిల్పి-ధ్యానమున్
పువ్వుల పూజసేయుచు-అమోఘ విలాసము పొందుచుండునో-
అవ్విమలాత్ముఁడొందు-పరులందగరాని మహాపదంబు-నే
నవ్విధి జీవితంబు-హరి కంకిత మిచ్చెదనయ్య సద్గురూ!

చండా:- (ఒకనినిజూచి) ఓయీ! నీవా క్రొత్తగా వచ్చిన కుఱ్ఱవానికి ఓనమాలు దిద్దిపెట్టుము.

2 బా:- (ఓనమాలు దిద్దిపెట్టి వానిచేఁ బలికించును)

చండా:- వింటివా ప్రహ్లాదా! ప్రణవపంచాక్షరీ మంత్రముతో ప్రారంభమైనదీవిద్య. ప్రణవము వేదములకెల్ల మూలము. ప్రణవమనెడి పంజరమున నివసించు చిలుక శివుఁడు. కావున, శివభక్తినేల విసర్జింతువు? నిష్కారణముగ తండ్రికి విరోధి వయ్యెదవా? శివుఁడు దేవుఁడు కాఁడా?

ప్ర:- కాఁడని నేననుటలేదు. నామనస్సనెడికన్య భక్తిరసావేశమున అలంకార ప్రియుఁడైన శ్రీ మహావిష్ణువును మోహించినది. అట్టిదానిని వేరొక మార్గమునకు మరలించుమనుట ఉత్తమ లక్షణమా?

గీ॥ మోక్షదాతయై - శ్రీవిష్ణుమూర్తి యుండ -
ఇతర దేవతలకు మ్రొక్క నేలనయ్య -
కామధేనువు - తనయింటఁ గ్రాలుచుండ -
వేఱె యింకొక్క గోవును వెదక నేల?

చండా:- చెట్టు చెడు కాలమునకు కుక్కమూతి పిందెలుపుట్టును. విష్ణువు నీ తండ్రికి గర్భశత్రువు కావున నీకు విష్ణు భక్తి తగదు. రాజగురువుల కుటుంబమున పుట్టినవారమని హిరణ్యకశిప మహారాజుగారు మా యెడ ఎంతో భక్తిశ్రద్ధలు చూపును ఒక్క బాలుని మనసు మార్పఁజాలక అసమర్థులమై ప్రభువుల ముఖమెట్లు చూడఁగలము? శుక్రాచార్యుల ఆశ్రమమునకే యిది పరీక్షసమయమా యేమి? ఇట్టి విచిత్ర ఘట్ట మెప్పుడును మాకు ప్రాప్తింప లేదు......బాలకా! మానుము.

చ॥ కలహముఁ బెంపకయ్య కలకాలము శ్రీహరి నెంచకయ్య మా
పలుకులు విశ్వసింపు మనవారలలో నిటువంటి ద్వేషముల్
గలుగుట చూడలేదని జగంబులు వాకొనుచున్న వయ్యయో
పలువుర నోట నానుటిది పాపము తండ్రికిఁ గోపమాపుమా.

ప్ర:- హరిభక్తి మానను.

శా॥ ఆర్యుల్ గర్వవిదూరులై సతతయోగానంద సంతృప్తులై
నిర్వాణైక పథ ప్రచారరతులై నిశ్చింతులై శాంతులై
గీర్వాణార్తి హరున్ హరిన్ మనసులోఁ గీల్కొల్పి కీర్తించుచున్
సర్వం విష్ణుమయం జగత్తనెడి వాక్సత్యంబు బోధింపరా.

చండా:- గురువును గూడ ధిక్కరించెదవుగా! నిన్నేమి చేసెదనో చూడుము.

ప్ర:- ఏమి చేసిననుసరే. హరిభక్తి మానను. మంచి మార్గమున కడ్డుతగిలినప్పుడు ఎవరినైనను జక్కఁజేయ ధిక్కరింపలసినదే. ప్రొద్దుతిరుగుడు పూవును సూర్యుని వైపు తిరుగకుండ ఎవ్వరాపఁగలరు?

సీ॥ శ్రీహరీ! నీ కథల్ చెవులసోకిన యంత
సంసార బాధలు సమసిపోవు

కంజాక్ష! నీతను కాంతి కన్నులఁజూడ
నద్భుత సంతోష మావహిల్లు
పరమపావన! నీదు పాదాబ్జములు గొల్వ
నత్యున్నతత్వంబు నందఁగల్గు
మాధవా! నీనామ మహిమామృతముఁ గ్రోల
భవబంధములు పటాపంచలగును
తే॥ బరమ కళ్యాణమూర్తివై పరగునట్టి
నీపయిన్నిల్చె నా మది నిశ్చయముగ
భక్తవత్సల నీ దివ్యపాదమాన
రార లక్ష్మీమనోహర మేరుధీర.

చండా:- ఇప్పుడు నామనస్సు అడకత్తెరలోని పోఁకచెక్కైనది.

కం॥ ఒడయని కొడుకని కొట్టక
నొడివితినా చదువురాదు - నొవ్వఁగఁజేయన్
తడవునొ తప్పని; అకటా!
బడిపంతులుకంటె మందభాగ్యుఁడు గలఁడే!

బాలకా!

గీ॥ చండశాసనుఁ డుద్దండ భండనుండు -
తండ్రి యనుమాట - రవ్వంత తలఁపవేమి?
శ్రీహరీ! యని - ఆతేని చెవిని బడిన -
దండతాడిత భుజగమై - తారసిలఁడె.

(చెవిపట్టుకొని) హరిభక్తి మానవా?

ప్ర:- మానను.

చండా:- మానవా? ఇఁక నీగతి యెట్లుండునో చూడుము. నేనా మహామంత్రవేత్తను. ఇప్పుడే ఒక శక్తిని పుట్టింపఁగలను. సంజీవనీత్యాది మహామంత్రసిద్ధుఁడు మాతండ్రియగు శుక్రాచార్యుఁడు. రావే ... ఓం ... హ్రాం ... హ్రీం ... రావే మహాశక్తి.

(తెరలోధ్వని - బాలుర ప్రహ్లాదుని వెనుక చేరుదురు)

ప్ర:-

ఉ॥ ఎక్కడనుంటివో హరిహరీ! ఇపుడేగతి నన్ను బ్రోఁచెదో-
దిక్కొకయింత లేక-కడు దీనుఁడనై నిను వేఁడుచుంటి-నా
దిక్కు మొగంబుచూపి-కడ తేర్పుము కష్టదవాగ్ని నుండి-ని
న్నొక్కని నమ్మియుంటిని ప్రభూ! ఇటు రాఁగదవయ్య మాధవా!
[శక్తి చండాచార్యులను లోనికిఁ దఱుముకొనిపోవును]

చండా:- (తప్పించుకొనుచు) ప్రహ్లాదా! రక్షింపుము.

ప్ర:- అందఱు హరిభజన చేయుఁడు. (చేయుదురు) హరీ కృష్ణా! పాహిమామ్. పాహిమామ్.

[చక్రము వచ్చి శక్తిని పాఱఁద్రోలును]

చండా:- పోయినది. శక్తి పాఱిపోయినది. గుండె దడదడకొట్టుకొనుచున్నది. నాలుక పిడుచగట్టినది. (బడిపెద్దతో) పిల్లవాండ్రను చూచుచుండుము. నేను మంచితీర్థము పుచ్చుకొని వచ్చెద. [నిష్క్రమించును]

ప్ర:- బాలులారా! చూచితిరిగదా! హరిమహిమ. శ్రియఃపతి మచ్ఛ్రేయోభిలాషి కంఠదఘ్నజలంబుగా నన్ను సముద్రము నందుంచినను నేను హరిభక్తిమానను. మిత్రరత్నములారా!

సీ॥ మాటలాడుచునున్న మౌనమ్ముదాల్చిన
మాధవు మహిమలు మననమగును
ఆటలాడుచునున్న పాటపాడుచునున్న
గోవిందు లీలలు గోచరించు
స్నానమాడుచునున్న సద్గోష్ఠిలోనున్న
కంజాక్షు రూపమ్ము కానిపించు
జాగరూకతనున్న - స్వప్నమ్మునందున్న
హరికథా నాటక మాడుచుండు

గీ॥ శంఖ చక్ర గదా శార్ఙ్గ సహితుఁడగుచు
దివ్య భూషలతో లక్ష్మి తేజరిలఁగ
ఎచ్చు దాసుల కోర్కెల నిచ్చు విష్ణు
చింత విడఁజాల వేఱొక చింత యేల?

చండా:- (ప్రవేశించి) ఓరిపిడుగా! తోడిబాలురనుకూడ తయారు చేసితివా? ఇక మాజీవనమునకుఁగూడ లోటుకలుగును. మీ తండ్రిగారివలన మాకేమి మాటవచ్చునో నిన్ను మీయింటికి పంపెద. నీవలననాకును నాలుగు నమస్కారములురాక తప్పవు.

ప్ర:- నీ కేమి యపకారము చేసితిని గురూ!

చండా:- హరిభజన మానకుండుటయే. (ప్రహ్లాదుడు - ఊరకుండును) చింతించిన లాభము లేదు. రమ్ము పోవుదము మీ తండ్రి చెంతనైనను హరిని తలంపకుము. నాకు పరువుదక్కింపుము. బాలకులారా! భోజనమునకు పొండు. ప్రహ్లాదా! రమ్ము.

(నిష్క్రమించుచుండ తెఱవాలును)

చతుర్థాంకము - ద్వితీయ రంగము

అభ్యంతరగృహము

లీలా:- తనయా! నీసద్గుణములను వియచ్చర నారీమణులు నృత్తబంధములతో - నృత్య గీతములతో గానము సేయుచుందురని వినినప్పుడు కలుగు సంతోషము ఒక్కవిషయమున నీ తండ్రి ఆగ్రహమునకు పాత్రుఁడవయ్యెదవని జ్ఞప్తికివచ్చినంత దుఃఖముగా మారుచుండును.

ఉ॥ పుట్టినదాదియున్ గడుసుపోకలు పోవుట - రాచబిడ్డకుం
బెట్టినపేరు - నీవునొక వీరశిఖామణీ పుత్రకుండవే -
పుట్టు విరోధియైన హరిపూజ లొనర్చెదవేల? దీన నా
కట్టిడి దైవమెవ్విదిని - కాఱియ పెట్టదలంచెనో కదా!

హిర:- [ప్రవేశించి] దేవీ! యెప్పుడును ఏదియో చింతాక్రాంతచిత్తవైనట్లు కనఁబడు చుందు వేమి?

లీలా:- ప్రహ్లాదుని యోగక్షేమములు విచారించుచున్నారా?

హిర:- విచారించుచున్నాను. వెఱ్ఱిదానా! నాకుమాత్రము కుమారుఁడు కాఁడా?

లీలా:- గురుకులాశ్రమమునకుఁబంపి చాలాకాలమైనది. పసివాఁడు కదా! బెంగపడియుండునేమో!

హిర:- వానికేమియునుండదు నీవే బెంగపడవలయును

లీలా:- అటులేయనుకొన్నడు. ఎటులైనను కొడ్డువానిని చూడవలయు నని నాకు కుతూహలము, జనించినది.

హిర:- సరియే. వాని విద్యాభ్యాసమెటులుండెనో గమనింపవలయుఁ గదా! పిలిపించెద వ్యాఘ్రిపాదా!

వ్యాఘ్ర:- (ప్రవేశించి) దేవరవారియాజ్ఞ.

హిర:- చండాచార్యులను, ప్రహ్లాదుని దోడ్కొని రమ్ము.

వ్యాఘ్ర:- చిత్తము. (నిష్క్రమించును)

హిర:- రాజ్యకార్య నిర్వహణ భారముకంటె ప్రహ్లాదుని జీవిత విధానమును మార్పు చేయవలసిన బాధ్యత ఎక్కువగానున్నట్లు తోఁచుచున్నది.

వ్యాఘ్ర:-(ప్రవేశించి) సమయమునకు వారే వచ్చుచున్నారు ప్రభూ!

ప్ర:- (ప్రవేశించి) జననీజనకుల పాదారవిందములకు వందనములు (తల్లినిసమీపించును)

చండా:-(ప్రవేశించి) దానవసార్వభౌమునకు జయమగుఁగాక!

హిర:- గురుపుత్రా! నమస్కారము. ఈయుచితాసనమలంకరింపుఁడు. కుమారుని విద్యాభ్యాసమెట్లున్నది?

చండా:- సార్వభౌమా! తమ పుత్రుఁడు తెలివి తేటలు గలఁవాడు, ముంజేతికంకణమున కద్దమేల? పరీక్షింపుఁడు.

హిర:- నాయన ప్రహ్లాదా! ఇటురమ్ము. నీవలననే వంశముద్ధరింపఁ బడయవలయును. గురువు లేయేశాస్త్రములు బోధించిరి? ఎట్టి విద్యలను గ్రహించితివి తండ్రి!

ప్ర:- జనకా! గదువులలోని మర్మమంతయు గ్రహించితిని.

చం॥ చదివి-సమస్త ధర్మముల సత్వమెఱింగిన యొజ్జనేర్పగా
చదివితి-వేదశాస్త్రముల సారము గ్రోలితి-నింక ఎంతయున్
జదివిన నేమినార్థకము-శాంతిముతో హరిపాదపద్మముల్
హృదయమునందునిల్పి భజయించుటకంటె సుఖంబు కల్గునే?

హిర:- ఓరీ బాలకా! ఇదియా నీవు చదివిన చదువు. పామ్మావలకు (నెట్టును) (చండామార్కులఁజూచి) ఓయీ! చండామార్క! కృతఘ్నుఁడవై మాకెట్టి యపకారము చేసితివి. గోముఖ వ్యాఘ్రమని గ్రహింపక ఈ అర్భకుని నీకప్పగించితిని. వీని నొక పయోముఖ విషకుంభముగాతియారుచేసినావు. నీకపట వాక్యములను నమ్మి మోసపోయితిని. శుక్రాచార్యులుండిన ఇది ఇట్లుజరిగియుండదు.

చండా:- ఇందు నా తప్పేమున్నది ప్రభూ!

హిర:- శిష్యుఁడు దుర్మార్గుఁడగుట గురువుతప్పుగాదా?

చండా:- కాదుప్రభూ! అదివానికి సహజగుణము.

హిర:- ఆఁ! (కోపముతో) హరినామ స్మరణము దైత్యులకు సహజ గుణమా? ఇదిగో ఖడ్గము. [కత్తిదూయును]

లీలా:- (వారించి) నాథా! పూజ్యపాదులు...గురుపుత్రులు...

చండా:- దనుజేంద్రా! మావలన తప్పులేదు మీరు దీర్ఘముగా విచా రింపుఁడు ప్రహ్లాదుని హరిభక్తి మాన్పవలయునని అనేక విధముల ప్రయత్నించితిని నాప్రయత్నమంతయు బూడిదలో పోసిన పన్నీరైనది. ఈతని ప్రబోధముచే నా పాఠశాలలోని బాలురందఱు హరినామస్మరణమును ప్రారంభించినారు.

లీలా:- నాథా! వీరు మనమేలుకోరువారు. శుక్రాచార్యుని పుత్రులు పాపభీతిగలవారు. విశ్వాసపాత్రులు.

హిర:- అటులైన మీరిఁక దయచేయుఁడు.

[చండామార్కులు లేచి నిలువఁబడును]

లీలా:- గురుపుత్రులకొక మనవి. బాలకునిపై నిగల కోపముచే ప్రభు వుగారు మిమ్మింంచుక మందలించినారు. దానిని మీరువేఱుగా భావింపవలదు.

చండా:- బ్రతికితిని తల్లీ! సెలవు. (నిష్క్రమించును)

హిర:- [విచారముతో] నిదురపోవుచున్నవానిని మేల్కొల్పవచ్చును గాని మేలుకున్నవానిని మేల్కొల్పుటెట్లు? శివదీక్షాపరుల

వంశమున ఇట్టి బాలుఁడేల కలిగెను? వీడొక దేవానాం ప్రియుఁడు. కొఱకరాని కొయ్య వీని నెట్లు బాగుచేయఁ దగును?

ఉ॥ వీరరసోచితంబగుచు-వీనులకింపొనఁగూర్చు పల్కు-నో
రార వచింతువంచు-మనసారఁగ నే చెవియొగ్గియొగ్గి వే
సారితి-నేఁటికైన వినజాలక పోవుట దట్టులుండఁగా-
సారెకు విష్ణుకీర్తనము సల్పుదె? ఏగతిగోరి బాలకా!

శా॥ నాకంటెన్ భగవంతుఁడొండు కలఁడే-నా కేశదిక్పాలకుల్-
నాకున్ మ్రొక్కుచు నుంద్రు-యజ్వలును-జన్నంబందు-హవ్యాదులన్
నాకే యర్పణ చేయుచుండిరిగదా! నన్నేల పూజింపవో-
నాకు న్నీకును పుర్షణంబున-మహానాశంబికే మున్నదో!

లీలా:- నీతండ్రిగారి మనస్సు కష్టపెట్టకుము తల్లినైన నేను మీ తండ్రిగారిని జూపితిని. మీ తండ్రిగారు గురువును చూపినారు. గురువు భగవంతుని జూపును. అట్టి శ్రేణికిఁజెందన తండ్రిగారి మాట పాటింపకుండుట తగునా?

ప్ర:- తగదుతల్లీ! నేను భగవత్సాన్నిధ్యముకొఱకై ప్రయత్నించు చున్నాను. సొమ్ములు వేఱైనను బంగారమొక్కటే. పేరులు వేఱైనను భగవంతుఁ డొక్కఁడే!

హిర:- బిడ్డా ఇటురమ్ము (చేరఁదీసికొని) నీమందహాస సుందరవదనారవిందమును గాంచినప్పుడెల్ల మా యానందమునకు మేర యే యుండదు నీ నవ్వులు మల్లెపువ్వులు. నీ మాటలు వరాల మూటలు. నీ పాటలు తేనెయూటలు. నీ గానము సుధారస పానము నీరూపము దానవలోక కలాపము. అన్నియు బాగుగ నున్నవి. కాని మన కాగర్భశత్రువైన హరినామ స్మరణము నీ కెవ్వరు బోధించిరి? చిన్న తండ్రీ! ఆ మాటలు మానుము నాయనా! అవి మనము చ్ఛరింపరాదు.

ప్ర:- జనకా! మీకీ భేదబుద్ధి ఏల జనించెను? మతద్వేషము రాజు

లకు సర్వనాశము కలిగించును. దాననే మన దానవులు అధఃపతన మగుచుందురు. మతద్వేషము వలదు నాయనా? అది హాలాహలముకంటె అతి భయంకరమైనది.

శా॥ అంతశ్శత్రువులన్ జయించి - ఇహ మిథ్యావాద మాలించి - వే
దాంత శ్రీని గడించి - జన్మకోక కళ్యాణంబు సాధించి - ని
శ్చింతన్ దివ్యపథాను వర్తివయి - వాసింగూర్చుకో చెల్లు - ఈ
పంతం బేల? వృథాప్రయాస - హరిపై వైరంబు చాలింపుమా.

హిర:- ఈ భేదబుద్ధి నాకే కాదు ఆ హరికినిగలదు. ఆతఁడు సురపక్షపాతి మన వంశాంకురమును నశింపఁజేయ వలయునను దీక్షకలవాఁడు. వరాహరూప ధారియై మీ పినతండ్రిని చంపిన బలవద్విరోధి. అట్టివాని పేరు తలంచుట మన మతముగాదు. మన పూర్వుల మతముగాదు

ప్ర:- తండ్రీ! లోకములన్నియు జయించినాఁడవు. కాని నీ మనస్సునే నీవు జయింపలేదు. కామక్రోధాదులైన ఆర్గురు శత్రువులను జయించినచో నీకు విరోధియే లేఁడు. ఆ హరిని భజింపనిచో నా జన్మము తరింపదు.

సీ॥ అచ్యుతుఁ బూజించు హస్తంబు హస్తంబు
కమలనాభునిజూచు కనులు కనులు
శ్రీహర్షునకుమ్రొక్కు శీర్షంబు శీర్షంబు
మధుసూదనుని మీఁది మనసు మనసు
వారిజాక్షు నుతించు వాక్కులు వాక్కులు
శివహితుకథ విను చెవులు చెవులు
గరుడవాహను గొల్చు కాయంబు కాయంబు
చక్రిఁజింతించెడి జపము జపము

గీ॥ విష్ణు మహిమను జాటెటి విద్య విద్య
ధరణిధవు భక్తి బోధించు తల్లి తల్లి
దనుజరిపు లీల తెలిపెడి తండ్రి తండ్రి
గురుఁడు నారాయణుని జూపు గురుఁడు గురుఁడు.

హిర:- ఓరీ ముష్టిపంచా! వైష్ణవాచంయములు నిన్నీ అపథమ్మున కెప్పుడు త్రిప్పిరో తెలియకున్నది. నిజముగా నీవు క్రూర కర్మరతుఁడవు. హంతవ్యుఁడవు. జనక ద్రోహివి. ఇక సహింపను. (ఆలోచించి) ప్రేయసీ! వీని మనస్సులో మైనము మీఁది ముద్రవోలె హరిభక్తి చక్కఁగా హత్తుకొన్నది. కారణము?

లీలా:- నా దురదృష్టము నాథా!

హిర:- ఓసీ! వదరుఁబోతా! నీకు కాలము సమీపించినది. శైవమతమున పుట్టిన నీకీ విపరీతబుద్ధి యేల కలిగినది

శా॥ ఈశానున్ స్మరియింపకీ పగిది-లక్ష్మీశునన్ సదాకొల్చెదే?-
ఏశక్తిన్ మదినమ్మిపెట్టెదవు నాకే పంగనామంబులన్-
లేశంబైనను బుద్ధి మాఱదిది మేలే - నిన్ను ఖండింప-మా
ఆశాసౌధము కూలిపోవునని - నేనల్లాడెదన్ పుత్రకా!

లీలా:- (దుఃఖముతో) రాజగృహమునకు చిచ్చు ముట్టుకొన్నది. ఇంకెవ్వరు శరణ్యులు? ప్రహ్లాదా! ఈ వాక్కలహ మెందులకు తండ్రీ!

చం॥ నడచుచు-నవ్వుచున్-నిలిచి నాట్యము సేయుచు-నిద్రబోవుచున్
కుడుచుచు. త్రాగుచున్. సఖులఁగూడుచు ఆడుచుపాడుచున్సదా
విడువవు శ్రీహరిస్మరణ-విష్ణువు దొడ్డవిరోధి తండ్రికిం
చెడఁదఁ దలంపవేమి? తగవే? పగవారలనమ్మి కొల్వఁగా.

హిర:- ఓరీ మహాపాపీ! చిలుకకు చెప్పినట్లు ఎన్ని విధముల నయబోధ గావించినను నీ గుణము మాఱలేదు. ఇఁక శాంతవచనంబులుపయోగించుట అసమర్థతగా పరిగణింపఁబడును. త్రిలోకాధిపతియగు ఈదానవ సార్వభౌముని ప్రతాపాగ్నిజ్వాలలకు భస్మమయ్యెదవు సుమా! హరిభక్తి మానెదవా? నీప్రాణముల వీడెదవా?

చ॥ వెఱవవు తండ్రిమాట, కవినేకముచే హరినామ మెప్పుడున్
మఱవవు-వంశపద్ధతుల మన్ననసేయవు-నేల నాలుగుం
జెఱగులు మాసిపోయినవి-చెడ్డ యశోంకముచేత-ఇంక నా
కఱకు కరాసిధార కెఱగా నిను చీరక ఊరకుందు నే!

[కత్తిదూయును]

లీలా:- (అడ్డుపడి) నాథా! పసివాఁడు. మన్నింపుఁడు.

హిర:- సాధ్వీ! ప్రహ్లాదుఁడు నీగర్భమున పుట్టలేదనుకొనుము. ఓరీ! మూర్ఖా! ఉద్రిక్త ప్రళయకాలరుద్ర క్రోధానలసదృశం బైన యస్మచ్ఛౌర్య బడబాగ్నిం బ్రసరింపఁజేసితినేని సప్త సముద్రములిగ్రింకు. జగద్భయంకరమ్ముగ హుమ్మని పాదతాడన మ్మొనర్చితినేని పాతాళమ్మున ఫణిరాజు వడవడవడంకి ఫణములవంచు. భీషణరోషావేశంబునఁ జిటచిట చిచ్చులు చిందు చుఱుకు చూపులఁ బఱపితినేని ప్రేతపతియైన నిల్వనీఱగు. కింక హెచ్చబింకమ్మున నంకిలి సెప్పితినేని సూర్య చంద్రాది గ్రహగతులాఁగు. కులగిరులఁబెకలించి పూల చెండ్లవలె నాకసమున నాడింతు దిగ్గజముల తొండములఁ బట్టి గిరగిరఁద్రిప్పి విసరివైతు. ఇట్టి నాయట్టి జగజ్జెట్టికిం గట్టలుక పుట్టించిననీకెట్టిగతిపట్టునో నెట్టన నూహించుకొమ్ము.

లీలా:- [భీతితో] హా! హా...త...భా.. గ్య...ను. దుర్విధీ!

చ॥ కొడుకులు లేక లేక-హరిఁగూరిచి నోములు నోచినోచి-ఈ
పడసిన పుత్రకుండు-మన పాలిటి శత్రువుగాగమాఱె-ఏ
వడువున వీనిభావమును బాగొనరింపఁగవచ్చు అక్కటా!
కొడుకు జనింపకుండినను-గోడొనఁగూడదు నాకు దైవమా!

హిర:- బాలకా! నేను హరిపై పగసాధించుటకు భూనభోంతరాళములు ప్రతిధ్వనింప రణభేరి మ్రోఁగించుచుండ, నీవు హరిభక్తి చాటుటకై శంఖారావము మిన్నుముట్ట పూరించెదవా? ఎంతటి కృతఘ్నుఁడవురా. ఇదియే నీకు కడపటి అవకాశము

ఇంచుక కాలవ్యవధి నొసంగితి. యోచించుకొనుము. మేలెంచుకొనుము.

ప్ర:- యోచింపవలసిన పనిలేదు.

చ॥ విడువగజాల విష్ణురతి-వీనుల విందుగ అన్యకీర్తనల్
నుడువఁగఁజాల-వైష్ణవులనోట వచించెడి వేదవాక్యముల్
కడవఁగఁజాల-నన్ గరుణగాంచెడి శ్రీహరివీడి వేఱుగా
నడవఁగఁజాల-ఓ జనక! నన్నిఁక ఏమి యొనర్చినన్ సరే!

అహోరాత్రములు నా రక్తమునంగల ప్రతి పరమాణువునందును హరినామస్మరణము ధ్వనించుచుండును. వలయునేని మీ ఖడ్గప్రహారణముచే పరీక్ష సలుపుఁడు.

హిర:- చివరకది తప్పనిపని యగునేమో!

ప్ర:- తప్పినను తప్పకున్నను మీకీ వైష్ణవమతద్వేష మెందులకు తండ్రీ! మతమొక మత్తుపదార్థముగఁగాని, మారణ యంత్రముగఁగాని మాఱరాదు. తొలుతటి నుండియు సురాసురుల యుద్ధమునకు మతమొక ముఖ్యకారణము.

మ॥ మతవిద్వేషదవాగ్ని క్రొంబొగలు చిమ్మన్-ప్రాణిసంఘంబు-దు
ర్గతికింజిక్కి- దహించుసేళ-పతి యుక్తాయుక్తముల్ చక్కఁగా
మతి యోచించి-ప్రశాంతి మార్గమును నిర్మాణంబు గావించి-సు
స్థితికిందెచ్చుట యోగ్యమంద్రు-జనకా! చిత్తంబునందెంచుమా!
హరిభక్తి మానను.

హిర:- మానవా? ఛీ! నీముఖము చూడరాదు. (కోపముతో) వ్యాఘ్రపాద వజ్రదంతులారా!

వ్యా-వజ్ర:- (వచ్చి) దేవా! ఏమి సెలవు?

లీలా:- ఈ పితృద్రోహిని... ఈదైత్యకుల గౌరవ విధ్వంసకుని నిశిత ఖడ్గ ప్రహారణంబులచే చించి చెండాడుఁడు; కాదేని పర్వతాగ్రమునుండి పడద్రోయుఁడు; కొమ్ము టేనుఁగులచే త్రొక్కించుఁడు; సముద్ర మధ్యమున ముంచుఁడు; భూమిలో పాతిపెట్టుఁడు; మహాసర్పములచే గఱపింపుడు; అగ్నికుండమునఁ

బడవేయుఁడు; ఇంతయేల? కత్తికొక కండతీసి చిత్రవధచేసి ఆవార్త నాకు వినిపింపుడు.

లీలా:-[భర్తకాళ్ళపైఁబడి] హా నాథా! కన్నకడుపు దుర్భరము... దుస్సహము ప్రహ్లాదుని చంపించెదరా? పుత్రవాత్సల్యము లేదా?

హిర:- పుత్రవాత్సల్యము...పుత్రవాత్సల్యమేఘజాలము అస్మదీయ వ్యసన వాయువులచే అదృశ్యమైనది ఇంకెక్కడి కొడుకు. ఎక్కడితండ్రి. నాభావనప్రపంచములో ఇప్పుడు దైత్యవంశ గౌరవము మూర్తీభవించి రాజ్యమేలుచున్నది. అట్టి ఆత్మ గౌరవ తేజస్స్వరూపమును హత మొనరింపఁబుట్టిన అంధకార ప్రాయుఁడవు కొడుకా! నీవు అప్రతిమాన శూరాగ్రేసరు లకు పుట్టినిల్లగు దానవాన్వయ రత్న ఖనియందు గులక రాయివోలె జన్మించితివిరా, ప్రహ్లాదా! నా పరితాపము నీకు పరమానందముగను నాక్రోధము నీకు శాంతముగను పరిణ మించుచున్నది.

మ॥ శివలీలం జెవులార నే విడుటకై శీఘ్రంబ రప్పింపఁ కే
శవు జాలమ్ములు చెప్పఁజూచెదవు నీచా! భూమిపై నిల్చె దే?
అవలీలన్ జగమేలు వాలుఁగల బాహాటోప కాలాగ్ని చే
దవదాహమ్మున భస్మమౌ పురుగు చందానన్ నినున్ జేయ నే?

ప్రేయసీ! పుత్రగాత్ర పరిష్వంగ సుఖాభిలాష నా హృదయ కేదారంబున మృగతృష్ణప్రాయమైనది? వదలుము... పొమ్ము...వ్యాఘ్రపాదా! చూచెదవేమి? (వ్యాఘ్ర-వజ్ర ప్రహ్లాదుని పట్టుకొందురు)

ప్ర:- అమ్మా! నమస్కారము.

ఉ॥ కంటికి రెప్పవోలె ననుఁగాచెడి శ్రీహరియుండ-ఈ మహా
కంటక కృత్యముల్ విజయగానముతో భరియింతునమ్మ! నీ
కంటికి నీరు తేవలదు- కాఁగలదానిని మాన్ప లేరు నీ
వంటి సుసాధ్వులున్-తిరిగివత్తు అపాయము లేక నమ్ముమా!

లీలా:- (బిడ్డను చేరఁదీసికొని)

చ॥ పసితనమాది - విష్ణుపదభక్తుఁడవై - నిన్నుఁ గన్న తండ్రికే
కసి గలిగించి - నా పలుకుఁగాదని - కాటికి కాళ్ళుచాచె దీ
వ్యసనము తీఱుటెట్లు కొడుకా! వినుమిప్పటికైన మాట-నీ
ఉసురులుపోన మా తనువులుండునె? మొండితనమ్ము చాటఁగా

[ప్రహ్లాదుని లాగుకొని పోవుదురు]

(తెఱ వ్రాలును)

చతుర్థాంకము - తృతీయ రంగము

— వైకుంఠము —

[నారదుని గానము వినబడుచుండ ఇంద్రాదులోక ప్రక్క
నారదాదిమునులొక ప్రక్కనుండి నమస్కరించుచుందురు]

నార:-

శా॥ ఓ కళ్యాణగుణాకరా! భవహరా! ఓ సత్యభాషాపరా!
ఓ కారుణ్య సుధానిధీ! ఘనసుధీ! ఓ సాధుసంరక్షకా!
ఓ కైవల్య గుహావిహారి! వరదా! ఓ దైత్యవైరీ! హరీ!
నీకున్ మ్రొక్కెద దర్శనం బొసఁగుమా నీ రేజ ప్రత్యేక్షణా!

(తలుపులు విప్పారును. లక్ష్మీ సమ విష్ణులు కనఁబడుదురు)

విష్ణు:- మధురగాన విధానమైన నారదుని మహతీనినాదము వైకుంఠ ద్వారమును సైతము భేదించినది.

తే॥ విషయవాంఛల దిగద్రావి విమలబుద్ధి
నెవఁడు నిశ్చల భక్తితో - నెఱిఁగి నన్ను
లలిత గానామృతమున నోలార్చుచుండు
నతఁడు మద్భక్తవర్యుఁడై యలరుగాత!

నార:- అదిఅంతయు మీ అవ్యాజ కరుణ రసవిశేషము.

ఇంద్ర:- దేవకార్యార్థియై ఇంద్రుఁడు మఱియొకసారి నమస్కరించుచున్నాఁడు.

విష్ణు:- మేలగుఁగాక! వజ్రీ! ఏమి వి శేషము?

మ॥ సురలెల్లన్ సుఖముండిరే? కుశలమే శుద్ధాంత కాంతాళికిన్?
పరివారంబు త్వదీయ శాసనము సంభావించునే? కల్పముల్
నిరతాహ్లాద మొసంగునే? సురభియెంతేఁగూర్చునే? స్వేచ్ఛమై
సురసామ్రాజ్యము నేలు ధన్యుఁడవుగా! శ్రోతవ్యముల్ చెప్పుమా

ఇంద్ర:- ఏమున్నది దేవా! మేము అమరులమగుటకంటె నరులమైన
ఎంతయు మేలయ్యెడిది పోవుటకు వీలులేని మా మొండి
ప్రాణములు విచారగ్రస్తమైన జీవయాత్ర గడుపుచున్నవి.

విష్ణు:- ఇంద్రా! ఏమి యింతనిస్పృహ చెందుచుంటివి? ఇంతటి దీనా
నాలాపము లెందులకు?

తే॥ సహజముగ శోభగలదయ్యు - సౌందర్యమైన
మంచుచే కాంతిబాయు పద్మంబువోలె
చిన్నవోయెను నీ మోము చెన్ను దఱిగి
ఏమి కారణమో నాకు - ఎఱుఁగఁజెపుమ

ఇంద్ర:- క్రూరులగు దైత్యదానవు లొనరించు మహాపశాధములింక
సహింపలేము, తలచుఁకొన్న కడుపు తరుగుకొనిపోవుచున్నది.

శా॥ ఏలీలన్ తెరియింతఁగాఁగలము - మేమీ కష్టవారాస్నధుల్
జాలింబొంద వె-మా మహాపదలుగాంచక నీవు రవ్వంతయున్
కాలాతీతము శోర్వజాలఁగలమా-కాపాడుమో శ్రీహరీ!
మేలేకీడగు కీడే మేలగును - స్వామీ! నీ ప్రభావమ్ముచే.

జయం:- శేషశయనా! ఆదైత్యరాజు మిమ్ము దూషించుట వినఁజాల
కున్నాము. ఇఁక నతని యనుచరులు చేయు ఘోరములా
దుస్సహములు.

సీ॥ మునుల గడ్డములకు - ముడిపెట్టి - చేపట్టి -
ఉయ్యాల లూగుఁను - ఒక్క ఖలుఁడు
యజ్ఞకుండములందు - ఆవు మాంసము వండి
కుక్క బుషులనోట - ఒక్క జడుఁడు

తాపస స్త్రీలను - దండించి - వ్రతభంగ
మొనరింప - కొంపోవు - ఒక్క మూర్ఖు
వనవాస జనమును - తన తేఱనకఁగట్టి -
ఊరక తోలును - ఒక్క నీచు
గీ|| కాల్చు మునిపల్లెలను - చీల్చు కన్నెలేళ్ళ -
పీల్చు నెత్తురు - తాల్చును పేవుల మెడ -
చెప్పఁజాలను - రాక్షసుల్ చేయుపనులు -
బ్రతుకు దెరువేది కాన - నీ పాదమాన!

విష్ణు:- ఔను. ఆజన్మ విరోధియగువాఁడు నన్ను దూషించుటలో ఆశ్చర్యము లేదు.

ఉ|| పాడితొఱంగి ఆఖలుఁడు-భాగవతోత్తముఁడైన బిడ్డనే -
వాడి శరమ్ముతోఁ బొడిచివైచి-మదీయ విరోధ దుర్వ్యథా
బాడబ మారుతీఱు-బహుభంగులఁ జూచెడి మూర్ఖుఁ, డింక న
న్నాడుట కేమి యట్లు-జనుపాంథుఁడు లోకమెఱుంగఁ జాలునే?

ఇంద్ర:- సురలందఱు మీపాదపద్మముల సన్నిధినిబడియుండఁ దలఁచియున్నారు.

విష్ణు:- వలదు. ఆతనిని వధించుటకుఁదగిన అవకాశములభింపక ఆలోచించుచున్నాఁడ. ఆతఁడు మనకే కాదు సర్వలోకకంటకుఁడు. సహజబల పరాక్రమ సంపన్నుఁడు. బ్రహ్మచే వరములందిన వాఁడు. పాపము పండనిదే యాతని చెండుట కష్టము. కాని ఒక్క మార్గము లభించినది. కలఁడుగదా లోకకళ్యాణ కలహ కారణుఁడైన ఈనారదుఁడు ఇమ్మహర్షి ప్రబోధముచే హిరణ్యకశిపుని పుత్రుఁడు మద్భక్తాగ్రగణ్యుఁడయ్యె దాన తండ్రి కొడుకులకు వైరము కలిగినది పుత్రుని చిత్రవధ చేయ నుంకించును. తనయిల్లైనను నిప్పు పెట్టుకొనుట కెవ్వరంగీకరింతురు. కావున. అప్పుడసురనాథుని హత మొనరింపఁగలను. ఇయ్యది అచిరకాలముననే జరుగఁగలదు. మీరిఁక పోయిరండు.

అందఱు:- మహాప్రసాదము. (నిష్క్రమింతురు) (తెఱవ్రాలును)

చతుర్థాంకము - చతుర్థ రంగము

(మోడివస్తువులతోను - గారడివస్తువులతోను దేవాంతకుఁడు - నరాంతకుఁడు ప్రవేశించుచున్నారు)

దేవా:- కొట్టరా, డోలుసరిగాకొట్టు.

నరా:- [డోలుకొట్టును]

దేవా:- అరే ఏమిటి ఆకొట్టడం? నోటికి చేతికి లడాయిపెడ్తే బాగా కొడ్తావే! ఇలాకొట్టాలి. [వాయించి చూపును]

నరా:-అయితే దేవాంతక! ఇంతమంది మాప్పెబువులు గొప్పదొరలు దాతలు బలేబలే విద్దెగలవాళ్ళు అందఱు వచ్చినారు, మరి నీవు గారడి చేస్తావా మోడి వేస్తావా?

దేవా:- గారడిచేస్తాను, మోడివేస్తాను. దేవలోకంలో ఉండే మహా మహా పట్నాలలో గారడీచేసి బహుమతులు పొందినాను. గంధర్వలోకంలో చిత్రకేతుమహారాజుగారు జరీ ఉత్తరీయం దయచేసినారు. భూలోకంలో ఆంధ్రదేశములో ఎక్కువగా సంచారంచేస్తాను. మృగయాపురి, క్షీరపురి, సింహాపురి, చెన్నపురి, దంతిపురి, మత్స్యపురి, పురుషపురి మొదలైన పట్నాలలోను - పెదారికట్ల, చినారికట్ల, అప్పికట్ల, బాపట్ల, మొదలైన పెద్దపెద్ద గ్రామాదులలోను మోడి విప్పియున్నాను. నాగూరు, నాగపట్నం, విశాఖపట్నం, మచిలీపట్నం, క్రొత్తపట్నం. వంకాయలపాడు, దోసపాడు, తక్కెళ్ళపాడు, నూతలపాడు, నీతలపాడు——

నరా:-ఆ.. నాతలపాడైతే నీవు మోడెయ్యాల్సిందే. అగ్గిమీఁదపడ్డ గుగ్గిలంలాగా మగ్గిపోతావ్.

దేవా:-సరేలే నరాంతకా! మైసూరు మహారాజుగారు ఈజరీతలగుడ్డను దయచేసినారు. మృగయాపురిలో ప్రజలు బలేదాతలు. ఈ బంగారుకడియం బహుమతియిచ్చారు.

నరా:- ఒకరిచ్చేదేమిటిరా? నీవు మంత్రంతో కొండన్ని రూపాయలు తయారుచేయ్. నేను వాటిని పాతరపెడ్తా. కావలసినప్పుడు తీసి వాడుకుంటాం.

దేవా:- ఓరి పిచ్చివాఁడా! అవినిల్చే రూపాయలు కావురా. దరిద్రునకు కోరిక లెక్కువ. చెల్లనిరూపాయికి గీత లెక్కువ. సుఖము లేని జాతకునకు చేతిలో రేఖ లెక్కువ. వట్టిగొడ్డున కఱపు లెక్కువ. పనిచేయనివానికి మాట లెక్కువ.

నరా:- ఇవన్నీ మాకక్కఱలేదు. ఈపట్టణంసంగతి నీకు తెలుసునా?

దేవా:- ఓ తెలియకేమి? ఇది హిరణ్యకశిపు మహారాజుగారిపట్నం. పెద్దపెద్దదొరలువచ్చి కూర్చున్నారు. గొప్పగొప్ప పనులు చేస్తా ఏడు గిరులు గీస్తాను.

నరా:- ఏడుగిరులు గీస్తావ్? అయితే మొదటిగిరిలో ఏంపెడతావురా?

దేవా:- మొదటిగిరిలో పిడికెడు అచ్చంతలు పెడ్తాను వాడుబుఱ్ఱ ఊఁదుకుంటు వచ్చేసరికి వాడిమీద అచ్చంతలుచల్తాను. అవి గండుతుమ్మెదలై ఝుంఝుంఅంటూ చుట్టిముట్టి వాడివొళ్లంత తెగ కుడ్తాయి.

నరా:- ఓరే దేవాంతకా! నిని మంత్రంచేత మళ్ళీ అచ్చంతలుచేసి కట్టు విప్పుకుంటూ కదనుదొక్కుకుంటూ రెండో గిరిలోకి వస్తేనో-

దేవా:- రెండోగిరిలో నల్లతాటి ఓలు, పెద్ద పెద్ద చింత బరికలు పెడ్తానురా.

నరా:- ఆఁ. తెల్సింది; వాడు రెండోగిరిలోకి రాగానే చింతబరికలు తీసికొని ఓటికేసి దబాదబా కొడ్తావుంటే వాడివొళ్లంతా పటాపటాపగిలి నెత్తురుకాగాలన్నమాట బలేబలే అయితే అదిగూడ వాడు తప్పించుకొని మూడోగిరిలోకి వస్తే యేం చేస్తావురా!

దేవా:- మూడోగిరిలో రాట్నంపెడ్తాన్. వాడక్కడికి చరాచరా వచ్చేసరికి దానిని బరాబరా తిప్పుతాను.

నరా:- వాడు గిరగిరాతిరిగి పడిపోతాడుగదూ! భేష్. బాగుంది. అయితే అదిగూడ తప్పించుకొని నాలుగో గిరిలోకివస్తే ఏం పెట్టావ్?

దేవా:- బుట్టకింద రూపాయి పెడ్తాను. నాట్యం ఆడుకుంటూ నాగస్వరమూదుకుంటూ వాడువచ్చి బుట్టమెత్తేసరికి రూపాయి కాస్తా ఊరపిచ్చుకై తుఱ్ఱున ఎగిరిపోతుంది.

నరా:- సెబాస్. సెబాస్, అయితే వాడుమళ్ళీ పిచ్చుకను రప్పించి రూపాయిగా చేసి అయిదోగిరిలోకి రావాలన్నమాట. సరే అయిదోగిరిలో ఏంపెడతావురా?

దేవా:- టెంకాయ పెడ్తాను వాడు పాడుకుంటూవచ్చి అడుగుపెట్టేసరికి టెంకాయను టపామని పగలకొడ్తాను. వాడిబుఱ్ఱ ఠాం ఠాం అని పగిలిపోతుంది.

నరా:- నీవు టెంకాయఎత్తేసరికే వాడుకట్టువిప్పి దాన్ని దాటి ఆఱో గిరిలోకివస్తే ఏంపెడతావురా?

దేవా:- త్రాసుపాము పెడ్తాను-కోడెత్రాసును-నల్లత్రాసును.

నరా:- అబ్బో-వాడు నాగస్వరమూదుకుంటూ మోడిపాట పాడుకొంటూవచ్చేసరికి కస్సునలేచి వాడిమీద పడబోతుందన్నమాట దాన్ని గరుడమంత్రంచేతబంధించిఏడోగిరిలోకివస్తేనో?

దేవా:- ఏడోగిరిలో ఏకాంతముగా ఉండే అమృతకలశాన్ని అందుకొనే మంత్రిగాడికి ఈ బంగారు కడియము బహుమతిస్తాను.

నరా:- [చూచి] ఎవరును రాలేదు.

దేవా:- అయితే నేను గారడిపనులు చేస్తాను చూడు.

నరా:- దేవాంతక! అడుగువేస్తూ నాగస్వరముమీఁద మోడిపాట యొకటిపాడు.

దేవా:- సరే. తాళంసరిగాకొట్టు. — పాట —

నీ చిన్నిచిన్ని మాటలకే-చిన్నదానా
నా చిత్తమెల్ల కరఁగిపోయె-చిన్నదానా!
ఆకొండ ఈకొండ-చిన్నదానా!
ఆ నడుమనున్న సెలయేఱు-చిన్నదానా!
ఏటి ఒడ్డుననున్న-చిన్నదానా!
ఆవెలదోటగాంచివె-చిన్నదానా!

తోటలోపలనున్న-చిన్నదానా!
ఆ తియ్యమామిడిచెట్టు-చిన్నదానా!
చెట్టుచిగురులు తిన్న-చిన్నదానా!
ఆ కోయిలల కువకువలు-చిన్నదానా!

(వ్యాఘ్రి - వజ్రి - ప్రవేశింతురు)

వ్యాఘ్ర:- ఎవఁడురా ఆ నాగస్వరము ఊఁదేవాఁడు?

దేవా:- దణ్ణాలు దొరలూ దణ్ణాలు.

వ్యాఘ్ర:- ఏమిరా నీయొద్ద గొప్ప పాములున్నవా?

దేవా:- ఉన్నవిబాబూ! మొన్ననే భూలోకములో నల్లమల కొండమీద పట్టాను. ఈ నల్లత్రాచును. మా పొగురుమీదుంది. కదిలిస్తే తోఁకమీఁద నిలఁబడి ఆడుతుంది బాబూ! ఇంకా కోఱలు తీయలేదు.

వ్యాఘ్ర:- ఇదొక్కటేనా?

దేవా:- ఇదొక్కటేమిటి......ఓ... చాల ఉన్నవి బాబూ! నల్లత్రాచు. తెల్లత్రాచు. గోదుమవన్నె త్రాచు, తాటి జెఱ్ఱి, పెంజెఱ్ఱి, తుస్సుపెంజెర, రక్తపెంజెఱ్ఱి, నూనెపలుగు, దాసరి పాము, కట్లపాము, కొండచిలువ, పసిగిరిపాము, రెండుతలల పాము మొదలైనవన్ని ఉన్నయిబాబూ! నా పేరుచెప్పి తేపాయ్యే పాము నిలవాలి. మాదొడ్డ మంత్రిగాణ్ణిలే దొరా! నేనుపట్టని పాములేదు, నేనుచూడని రాజ్యంలేదు.

వజ్ర:- అబ్బా! చాల గొప్పగనున్నదే?...నీ పేరు?

దేవా:- నా పేరు దేవాంతకుఁడు వాడిపేరు నరాంతకుఁడు

వజ్ర:- భేష్. బాగానుదిరినవిరా పేర్లుగూడా. ఎవరుపెట్టినారు రా ఈపేర్లు?

దేవా:- మా గురువుగారైన కవిగారు దొరా.

వజ్ర:- శుక్రాచార్యులా?

దేవా:- ఔను; దొరా! ఔను.

నరా:- ఇంకెవ్వడైన ఉన్నాఁడురా?

దేవా:- ఉన్నాఁడు. [గుడ్డబొమ్మ నిలఁబెట్టి] వీడే జోకరుగాడు నీతి,

నియమంలేకుండా ఎటువీలుగాఉంటే అటు కలుస్తూఉంటాడు. తోలుబొమ్మలాటలో కేతిగాడికి నకలు. వీడివ్వకపోయినా ఇచ్చేదాతలుంటే చెడగొట్టుతుంటాడు. వీడినిఇప్పుడు మూడు పట్లీలు కొట్టిస్తాను చూడు కొట్టరా–ఒకటి...రెండు . మూడు (కొట్టును; తా! ఆగు. ఆగు.

వ్యాఘ్రః:– ఆగుమాగుము నీవలన మాకొక్క సహాయము కావలసి యున్నది.

దేవా:– ఏమిటిదొరా!

వ్యాఘ్రః:– ఇతఁడు హిరణ్యకశిప మహారాజుగారి పుత్రుఁడు. ప్రహ్లాదుఁడు. వీనిని ఈపాముచే కఱపింపవలయును.

దేవా:– రాజుగారి కొడుకునే (వణకి) అమ్మయ్యో! మా ప్రాణం మీదికి వస్తది బాబూ!

నరా:– మా పీకిమీద కత్తెందుకు పెడ్తావు దొరా! పొట్టకొఱకు వచ్చాము. ఒరే దేవాంతకా! చిక్కు చింతపడేదానికంటె వెళ్ళి వెక్కిరించింది మేలురా

వ్యాఘ్రః:– ఇది రాజశాసనము. మాఱుపల్కరాదు (సమీపించును)

దేవా:– దూరంగుండుదొరా! దూరంగుండు. తాచు మాపొగురు మీదుంది.

ప్ర:– ఇందులకా నన్నిచ్చటికి తెచ్చినది

సీ॥ తలఁపడే నాపాట్లు – తలఁచినంతనె ప్రేమఁ
దలఁచువాఁడఘమును కలఁచువాఁడు
చూడఁడే నాబాధ – సుస్థిరంబగు భక్తిఁ
జూచువారిని – దయఁ జూచువాఁడు
పాపఁడే నాయార్తి – పరమ సాధుల మిత్తిఁ
బాపువాఁడు – పరముఁ జూపువాఁడు
తనుపఁడే – "మాంపాహిదాసోహ" మనువారిఁ
దనుపు వాఁడు – శుభతమనుపువాఁడు
గీ॥ వేదవేదాంత వేద్యుఁడై – వెలయువాఁడు
భక్తజన కల్పవల్లియై – పరగువాఁడు

నిశ్చలానంద మయుఁడుగా - నెగడువాఁడు
కనఁడె? తెలియఁడె; కరుణతో కావరాఁడె?

వ్యాఘ్ర:- చూచెదరేమి? మీకేమియు భయము లేదు. రాజుగారే ఈహత్య చేయమని పంపినారు.

దేవా:- ఈ రాజుకొడుకు తప్పేమి చేశాడు దొరా!

వ్యాఘ్ర:- తప్పో-ఒప్పో నీకెందులకు. చంపినచాలును.

దేవా:- కుఱ్ఱోడు ముచ్చటగా ఉన్నాడయ్యా ఏతల్లికన్నదో.

వజ్ర:- చచ్చేవాడికి ముచ్చటేందిరా? ఏలేవాడి ఎద్దుపోతేం? కానే వాడి కన్నుపోతేం? నీపని నువ్వుకానీరా.

వ్యాఘ్ర:- ఓరీ దేవాంతక! మొనగాఁడనని చెప్పుకొంటివే. నీకు గుండె లేదురా! చెప్పినట్లు చేసెదవా? లేక నీకండలు చెండవలెనా?

నరా:- శాంతించండి. చంపేదారి ఇంతకంటె దొఱకలేదా దొరా?

వజ్ర:- కొండలమీఁదనుంచి దొర్లించాం - కొండలు పూలదిండ్లైన విరా. సముద్రములో ముంచాం ఎడిన సొఱకాయబుడ్డిలాగా ఒడ్డుకుకొట్టుకొచ్చాడు. ఏనుఁగులచే త్రొక్కించాం చావలేదురా.

వ్యాఘ్ర:- వజ్రదంతా! ఇఁక మాటలతో పనిగాదు. తోడులేనిదే రాచపీనుఁగు పోదన్నారు. ముందు వీనిపనికానిత్తమా?

దేవా:- నాకెందుకు లేదొరా! ఇయ్యాల మాకేదోరాసి మీకంట బడ్డాము. రాజుగారు మమ్మల్నేమి సేయడుగదా?

వ్యాఘ్ర:- చేయడురా!

దేవా:- సరే లేదొరా! (నాగస్వరమూది పామును లేపుచుండును)

ప్ర:- హరీ! కృష్ణా! గోవిందా! ముకుందా! పాహిమామ్.

గీ॥ అల సహస్ర ఫణమ్ముల ఆదిశేషు -
చిత్రముగ - తనపాన్పుగా చేసికొనిన -
గరుడవాహనుఁడే ననుగాఁచుచుండ -
చిలువ పలువలు నన్నేమి చేయఁగలవు?

[గరుత్మంతుఁడు పామును తన్నుకొనిపోవును. గరుత్మంతుని గోళ్ళు చేతులకు గుచ్చుకొని నెత్తురు కారుచుండ పాములవాఁడల్లాడుచుండును] (తెఱవాలును)




(లీలావతి నేలమీఁద కూర్చుండి సోఫాపై తలవాల్చి దుఃఖించుచుండును)

లీలా:- ప్రియుఁడు పుత్రప్రేమ లేనివాఁడా? కాఁడు. నాఁడు కొడుకును తొడలపై నిడుకొని-

గీ॥ ఒక్క-నేత్రంబు నిప్పులు-గ్రక్కుచుండ-
ఒక్క కన్నశ్రుధారల-ఒలుకఁబోసె-
శత్రు విద్వేషవహ్నియు-పుత్రశోక
జలము, పెనఁగొని పొగలెగ-జల్లుకతన.

నాయనా! ప్రహ్లాదా! ఈ పాపాత్మురాలి గర్భమున పుట్టుట కంటె అడవిలో ఒక మ్రానుగా జన్మించిన చిరకాలము జీవించి యుందునే. హంతకులు లాగుకొనిపోవు సమయమున అమ్మా! అని అఱచి మాతృభక్తి వెల్లివిరియునట్లుగా చూచిన నీ చూపు నే నెట్లు మఱవఁగలను? ఈలోకములో ఇఁక నీవు నా కెచ్చట కనఁబడఁగలవు? నీధన్యజీవితములో నవ్యకీర్తికుసుమ కిరారంభోత్సవము జరుగునని తలంచితిని. ఓ హంతకులారా! మీకైన దయ లేదా?

సీ॥ ఎఱ్ఱని యెండలో-ఏన్గుచేఁ ద్రొక్కింప
అమ్మా! యటంచెట్లు లఱచినాఁడొ!
అగ్నికుండమునకు-అందఱు తన్నిడ్వ
అయ్యా! యనుచు ఎంత అడలినాఁడొ!
పర్వతాగ్రమునుండి-పడఁద్రోయ దొర్లుచు
ఎన్ని రాళ్ళకుఁ దాఁకి ఏడ్చినాఁడొ!

ఈఁతలోఁగోవిపోయి-లోతైన తావున
అబ్ధిముంచఁగ నెంత అదరినాఁడొ!
గీ॥ కటకటా! కన్నకడుపిల్లు కటకటపడి
మండుచున్నది ఒకమంట-మాన్పలేక;
బిడ్డ! నినుబాసి ఎట్లుజీవింపఁగలను?
ఏమికానున్నదో యిఁక ఈశ్వరేచ్ఛ!

హిర:- [ప్రవేశించి విచారముతో అటునిటు తిరుగుచుండును]

లీలా:- ప్రహ్లాదునకు మరణశిక్షయే విధింపవలయునా? దేశమునుండి వెడలఁగొట్టినచో ఎచటనైన తలఁదాఁచుకొని జీవించునే? మీకుమాత్రము కుమారుఁడు కాఁడా?

హిర:- నా కుమారుఁడు...నాకు...మారకుఁడు...ఈరాజద్రోహికి-ఈ పితృద్రోహికి - ఈ గురుద్రోహికి ఇంతకంటె వేఱొక శిక్షకలదా? మఱచిపొమ్ము. ఇఁక మఱచిపొమ్ము. పుత్రరూపముననున్న ఈగర్భశత్రువును చంపించి ఆపైన సహజశత్రువైన హరి మింటనకిన-ఇంటచిక్కిన.. విడువను.

లీలా:- (ఆలోచనతో) హరి విషయమున తండ్రికొడుకుల మార్గములు విచిత్రముగ ఒక్కచోట కలియుచున్నవి. ఇష్టముచే ఒకరు, విరోధముచే ఒకరు భక్తిచే ఒకరు, విరక్తిచే ఒకరు హరినామమును మఱవరు. వీరి శరీరములు బారెడుదూరములోఉన్నను మనస్సులు ఉత్తర దక్షిణ ధ్రువముల మేరనున్నవి. మధ్య భూమధ్యరేఖవలె నా మనస్సు పుత్రశోకతపనునిచే తపింపఁబడుచున్నది

సేవ:- జయము జయము మహారాజులకు...... వ్యాఘ్రవాదాదులు వచ్చి ద్వారముకడ నిలిచియున్నారు.

హిర:- లోనికిఁబ్రవేశపెట్టుము (భటుఁడు నిష్క్రమించును)

లీలా:- (దుఃఖముతో) ఎట్టికర్ణకఠోరవార్త వినవలసియున్నదోకదా!

(వ్యాఘ్ర-వజ్ర-ప్రవేశింతురు)

ప్ర:- [శీఘ్రముగవచ్చి] అమ్మా! అమ్మా! [తల్లిని కౌఁగిలించుకొనును]

లీలా:- వచ్చితివా నాయనా! నీప్రాణము లెట్లు రక్షింపఁబడెను?
హిర:- ఓరి నీచా! తప్పించుకొని పాతివచ్చితివా? ఆ టక్కరి హరిని
కొల్చినందుకు నీకుఁగూడ ఆబుద్ధియే పట్టునడినది. నిన్నెవరు
రక్షింతురో చూచెద.
లీలా:- ఇఁకనైన హరిభక్తి మానుము తండ్రీ!
ప్ర:-
ఉ॥ అమ్మరో? ఏటికే యిటుల ఆడెదు-శ్రీహరి దైవమంచు నే
నమ్మితి-నీదుపాద నళినమ్ముల సాక్షిగ-(తండ్రితో) విన్మునాయనా!
ఇమ్మెయిశౌరి వైరియని - యేటికి మాటల శూలనాడెదో-
కమ్మనినోర - చేదు తినఁగా తగదయ్య - త్రిలోక పాలకా!
నా మనవి ఒక్కింత ఆలకింపుఁడు.
చ॥ హరిపయి భేదభావమున-అజ్ఞులు కొందఱు ద్వేషబుద్ధులై-
తొఱఁగిర దేహముల్-బహుళ దుఃఖమయంబుగ-గాత్మ సేంద్రి! నీ
చరితము-శౌర్యశోభితము-సద్గుణపూత మొనర్పు మెంతయున్
పరమపదంబు ప్రాప్తమగు-ప్రాభవపోషణ! దైత్యభూషణా!
వ్యాఘ్ర:- ప్రభూ! (చెమట తీసి వేయుచుండును)
హిర:- ఏమది?
వ్యాఘ్ర:- దేవరవారికి ఏమని చెప్పఁగలము? మాశక్తికొలఁది అన్ని
విధముల హింసించితిమి. ప్రహ్లాదున కొక్కింతయు హాని
కలుగలేదు. మా తలప్రాణము తోఁకకు వచ్చినది. ఈ పని
మాకసాధ్యము దేవా! మన్నింపుఁడు
హిర:- అటులైన మీరిఁక తొలఁగుఁడు.

— సీసమాలిక —

హిర:- అతి గభీరంబైన అబ్ధిలో నినుద్రోయ
మృతినొంద కేరీతి బ్రతికితీవు
ప్ర:- క్షీరసాగరమందు శేషుపైఁ బవళించు
శ్రీహరి రక్షింపఁ జేటుగలదె
హిర:- కొండ కొమ్మలనుండి కూలఁద్రోయఁగఁజావ
కేభంగి జీవించి తెలుకపడదు

ప్ర:- కొండ మోసినహరి దండిగా ననుగావ
కొండ నాకొక పూల దిండుగాదె

హిర:- మదపుటేనుగులచేత మఱిమఱి త్రొక్కింపఁ
బ్రాణహాని యొకింత పడయవేమి

ప్ర:- ఆ గజేంద్రుని మొఱ ఆలకించినహరి
ఈ గజేంద్రుల పీడ నెఱుఁగఁడొకో

హిర:- అగ్గికంబమునకు అంటగట్టిన నంత
కాలదు నీమేను కతమదేమి

ప్ర:- ప్రలయాగ్నికీలల జలమయమ్మొనరించు
వటపత్రశాయి కాపాడుటరుదె

హిర:- తే॥ కాలసర్పాలునిను జుట్టి కాటువేయఁ
గీడు పొరయవు నీకు నెవ్వాఁడు తోడు

ప్ర:- పన్నగాశనుపై నెక్కి వెన్నుఁడున్న
పన్నగములన్న నాకేమి భయము జనక!

హిర:- వీనిని నేనే తుదముట్టింప వలయు. బాలుఁడు కాఁడు వీఁడు మాపాలిటి కాలుఁడు మఱచితి. వ్యాఘ్రపాదా! ఆవిషపాత్రనిటు తెమ్ము

వ్యాఘ్ర:- [విషపాత్ర బల్లపై పెట్టి నిష్క్రమించును]

లీలా:- (భీతితో) ఓ పరమేశ్వరా! ఫల వృక్షముపైనా నిప్పులు చెఱగుట... పిడుగులుపడుట! నాథా! ఎందులకీ విషము.

హిర:- ఎందులకో నీకే తెలియఁగలదు. సన్నిపాతరోగమునకు కడపటిమందులు విషాదులేగదా [లాగి] ఓరీ కృతఘ్నా! ఇదిగో! నీ ప్రాణాపహరణమగు కర్కోటక విషానలము.

లీలా:- నేనీదుఃఖము భరింపలేను. ఆ విషమును నాకిఁడు. నేను త్రాగెదను.

హిర:- వలదు. ప్రేయసీ! నీవు నాకేమి అపకార మొనర్చితివి?

ప్ర:- తల్లీ! వృక్షమేనశించిన ఫలములెట్లుకలుగును? వలదు. నీకు ప్రాణత్యాగము వలదు. ఆ విషము నాకొఱకే తీసికొని రాఁబడినది. తండ్రీ!

ఉ॥ ఆ పురుషోత్తముండనఁగ-ఆపగ ఆఁపగ రాఁకోపమా?
శాపము పాపుకోఁదగని తామసి-తామసి యూఁట నెంచవా?
శాపమొ-పాపమో-మనసశాంతమొ-పంతమొ-మిన్నుమన్ను నీ
కేపగిదిన్ వశంబయిన-ఈ హరివైరము రిత్తవోవునా?

హిర:- సతీ! పుత్రప్రేమను వదలెదవా, మగని మాటను తిరస్కరించెదవా?

లీలా:- మహాపాపము. పతియేదైవము మీయాజ్ఞ శిరసావహించెద.

హిర:- అటులైన ఆ విషపాత్రను నీచేతిమీఁదుగ వానికందీయుము.

లీలా:- ఈపనిగూడ ఈచేతులతోనే చేయవలెనా? హా! ప్రహ్లాదా! ఇది మాతృదేవతగాదు నీపాలిటి మృత్యుదేవత. ఉగ్గుపాలు పోసిన చేతులతో విషముపోసి చంపినదీతల్లి యను అపకీర్తి ఆచంద్రార్కముగ నాకు నిలిచియుండునుగదా!

హిర:- నీవు విషమీయనిచో మగనిమాట జవదాఁటె ననుమాట ఈ లోకమున ఆచంద్రార్కముగ నిలిచియుండదా?

లీలా:- ఔను. [విషపాత్రి తీసికొని] ఇది మాతృహస్తము గాదు. మారణాస్త్రము. విషము గ్రక్కుచున్నది. తండ్రీ! [ఈయఁబోవును]

హిర:- ఆఁగుము. ఈపని నీచేతఁజేయించుట నాయట్టివానికిఁ దగదు. వీని అంతమునేనో నా అంతమును వీఁడోకనుఁగొనవలయును. కాని ఏపాపమెఱుఁగని నీకీపాపముంట గట్టరాదు. తెమ్ము. ఆ విషపాత్రినిటుతెమ్ము [తీసికొని] హరిభక్తిమానవా?

ప్ర:- మానను తండ్రీ!

హిర:- ఇదిగో! కర్కోటక విషానలము. త్రాగుము. [ఇచ్చును]

లీలా:- హా కొడుకా! [ప్రహ్లాదుని కౌఁగిలించుకొనఁ బోవును]

హిర:- సతీ! నీవిచ్చట నుండఁదగవు పొమ్ము. [నెట్టును. లీలావతి మూర్ఛిల్లును]

ప్ర:- గరుడగమనా! వైకుంఠవాసా! పాహిమామ్.

చ॥ కుదురుగ సర్వలోకములు కుక్షిని నిల్పి యజాండమేలు నీ
పదములు గొల్చువాఁడ-నను భద్రముగా దరిఁజేర్చకొమ్ము-నా

హృదయ విహాయసమ్మున-ఖగేంద్ర విమానవిహారివై-సదా
పొదలిన నాపదల్ తనువు పొందున-కుందున-లోకపావనా

గీ॥ శివమతస్థుల నేను ద్వేషింప నేని-
చింతలనుమాని హరిని జంపింతు నేని-
పగల కేకీడు సలుపని వాఁడ నేని-
విషము నానోట అమృతమై వెలయుఁగాక! (త్రాగును)

హిర:- (కొంచెమాగి) వీఁడేది యోకాయసిద్ధిని పొందినట్లున్నది లేనియెడల ఎట్లుజీవించును? కటా! నాకిది హృదయవిదారకఘట్టము.

ప్ర:- తండ్రీ! నేనేకాయసిద్ధిని పొందలేదు. సర్వరక్షకుఁడైన భగవంతుఁడు నన్ను కాపాడఁగలఁడు.

హిర:- ఎవఁడా భగవంతుఁడు?

ప్ర:- ఎవఁడు సూర్యకిరణములందు ప్రకాశవంతములగు పలురంగులను చిత్రించెనో, ఎవఁడు చంద్రమండలమును, అమృతమయముగా ఒనరించెనో, ఎవఁ డాకసమునకు చుక్కలు తగిలించెనో, ఎవఁడు పూవులలోనికి తావిఁ జొప్పించెనో, ఎవఁడు మాతృగర్భస్థ శిశువులను పోషించుచుండునో, ఎవఁడు మాయా యవనికకు అవ్వలనుండునో అట్టి భగవంతుఁడైన హరిని ధ్యానించుచున్నాఁడ తండ్రీ!

హిర:- ఓరీ కుఱ్ఱవాఁడా! నీబుద్ధి పెడతలఁబట్టినదిరా. ఆ హరి భగవంతుఁడా? అటులైన అతఁడిపుడెచట ఉన్నాఁడు?

ప్ర:- ఎచ్చటనో యననేల? నీయందు నాయందు సకలభూతములందు ఎల్లదిక్కుల ద్యావాపృథువుల నిండియున్నవాఁడు. అతఁడు లేనిచోటు లేదు.

హిర:- అతఁడు లేనిచోటు లేదా? ఈ భవనమున, ఈ సభాస్థలమున నాకుచూపఁగలవా? ఆ అసుర కంటకుఁడు...ఆ సుర రక్షకుఁడనని విఱ్ఱవీఁగు పిరుఁడు... ఆ బడుగు జడదారులచే పొగడఁబడువాఁడు... నాతో ప్రత్యక్షముగ పోరాడఁజాలక ఎందు డాఁగెనో! శంఖచక్రగదా ద్యాయుధములతో ఆ పిఱికిపంద

నా యెట్టయెదుట కనఁబడిన వాని రూపమెట్లుమాఱునో నీవే చూడఁగలవు. శౌర్య సాహసముల నాతఁ డేమెఱుఁగు. పురుష సింహుఁడైనచో నాకంట ఏలపడడు? వానిని జూపఁ గలవా? చూపఁగలవేని నేనే సత్వరముగా జయుండనై అతని వైకుంఠము నాక్రమింపఁ గలను. ఈ స్తంభమున ఆ హరిని చూపఁగలవా? (గదనెత్తబోయి) ఇదియేమి భూమి గిఱ్ఱునఁ దిరుగుచున్నదే .....నన్నెవరో ఊర్ధ్వలోకమున కెత్తుచున్న ట్లున్నది. సుడిగాలియా? పెనుభూతమా? లేదు... . లేదు. నా కన్నులకేదియో మైకము గ్రమ్ముచున్నది. నా శరీరము లోని శక్తియంతయు ఎవ్వరో లాగివైచు చున్నట్లున్నది. కోపోద్రిక్తత వలనఁగలిగిన చిత్తవిభ్రమమా? కాదు, ఇందే దియో రహస్యార్థమున్నది. ఓరీ బాలకా!

శా॥ ఏరాడింభక! విష్ణువిందుఁగలఁడే ఈ స్తంభమందుండెనే?
రారా చూపుము-చూపకున్న ఇఁక నీ రక్తమ్ము నాధోసిటన్
ధారాదత్తము సేతు భూతపతికిన్ - దైత్యుల్ ప్రశంసింపఁగా
ఘోరాకారము దాల్చువాఁడ నిదె-నీకుంజావు నిక్కంబురా.

[గదతో స్తంభమును గొట్ట నృసింహమూర్తి అందుండి వెలువడి హిరణ్యకశిపుని తొడలపై నిడుకొని గోళ్ళతోఁజీల్చును]

ప్ర:- నరసురవరచక్రవర్తీ! నరసింహమూర్తీ! నీ భయంకర రూపముఁ జూడజాలము. శాంతింపుఁడు. మా తండ్రిగారి తప్పులమన్నించి సుగతిని ప్రసాదింపుఁడు. (నమస్కరించుచు)

చ॥ కదలవు నీ మహాత్మునెరిగాని సమస్త చరాచరంబు లీ
వదయత కన్నుమూసిన నజాండము మూఁతవడున్ క్షణంబులో
హృదయమునందు నీపటమునే లిఖయించి స్మరించువాఁడ నన్
పదిలముసేయఁగాఁ దగిన భారము నీయదిసుమ్ము మాధవా!

—: దండకము :—

శ్రీమన్మహాభక్త రక్షాకశాధ్యక్ష - నారాయణా - దేవ దేవా - లసద్భావ - శ్రీదేవ - భూదేవ - వైకుంఠ వాసా - బలోల్లాస-

మత్స్యావతారా - మహోఘౌఘదూరా - బుధాధార - కూర్మావతారా - నృసింహా - గళద్రక్త జిహ్వా - మిళచ్ఛౌర్య గాంభీర్య కూటా - నిరాఘాట - చంచత్సటాఝూట - నిర్వ్యన్నఖా - నిర్జరానంద సంధాయకా - దీర్ఘ దంష్ట్రాకరాళోగ్ర రూపా - చలన్నేత్ర దీపా - జయ శ్రీ కలాపా - శుభాకార - సర్వేశ్వరా - ధీర - విద్యుత్ప్రభాభాసమా - నీదు తేజంబు నేఁజూడఁగాఁజాల - శాంతింపుమా - మమ్ము రక్షింపుమా - ధర్మ సంస్థాప నార్థంబు లీలా విలాసంబులం జూపెదే - విశ్వరూపా సమస్తే నమస్తే నమః.

(ఆకాశమున - దేవతలు)

హరిపై వైరముతో ఈదేహము త్యజించి మీతండ్రి వైకుంఠమును శీఘ్రముగాఁ జేరఁగలఁడు. అన్యథా భావింపకుము. ఇది యంతయు భగవంతుని నిర్ణయము.

[భరతవాక్యము]

గీ॥ విమల విఖ్యాత విజ్ఞాన - విభవ విహిత
విశ్వకళ్యాణ మొనఁగూర్చ - విజ్ఞు లాచ
రించు యత్నమ్ములకు - విఘ్న మొసవకుండ
ఈశ్వరుఁడు కాచుఁగావుత - ఈ జగాల.

(ఆకాశమున నారదుఁడు)

తథాస్తు.



